# సద్గురు తత్త్వ బోధ

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి

ఏకమేవా ద్వితీయం బ్రహ్మ

ప్రజ్ఞానం బ్రహ్మ



తత్త్వమసి

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ

సర్వం ఖల్విదం బ్రహ్మ

సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ


బాపట్ల బ్రహ్మ సభ సభ్యులు

C/o. శ్రీమతి బొడ్డుపల్లి సత్యకామ

చీరాల రోడ్డు,

టాగూరు ట్యూటోరియల్ కాలేజివద్ద

బాపట్ల, గుంటూరు జిల్లా-522 101

ఫోన్: 24983.


వెల : అమూల్యము

ముముక్షువులకు ఉచితము

# అంకితం



సద్గురు మహాయోగి స్వామి శ్రీరామనాథ్ గారు

అపార కరుణతో మా స్వరూపమెట్టిదో భగవత్స్వరూపమెట్టిదో బోధ చేసి మా స్వస్వరూపమును నిర్వికాల సమాధి ద్వారా అనుభవింప చేసి జ్ఞాన భిక్ష పెట్టి తరింప చేసిన శ్రీ సద్గురు దేవునకు వినయ పూర్వకముగా ప్రణామములతో అంకిత మొనర్చుచున్నాము.

బాపట్ల బ్రహ్మ సభ సభ్యులు

ఓం
శ్రీ సద్గురోభ్యోం నమః

# నివేదన

**జ**నన మరణ ప్రవాహంతో కూడిన సంసార రూప దుస్తర సాగరాన్ని దాటటానికి 'బ్రహ్మజ్ఞానము' అంటే 'వేదాంత విద్య' అనే నావమాత్రమే శరణ్యము. ఈ బ్రహ్మ విద్య సమస్త విద్యలలో పవిత్రమైనది ఉత్తము మైనది. ఎందుకంటే జనన మరణ చక్ర బంధాల నుండి తరింప చేసి మోక్షాభిషిక్తుని చేసేది కాబట్టి. దాన ధర్మాలు, తీర్థ యాత్రలు, జపము, యజ్ఞయాగాది సకామ కర్మలు, అర్చనలు, పూజలు, వ్రతాలు, నోములు, ధర్మ కార్యాలు, పుణ్య కార్యాలు చేయటం మొదలైన ప్రవృత్తి మార్గాలు చిత్త శుద్ధి కలుగ చేస్తాయే కాని మనలో ఉన్న అజ్ఞానాన్ని రూపుమాపి మోక్షసామ్రాజ్యాభిషిక్తుని చేయటానికి బ్రహ్మ విద్యయే శరణ్యము.

అయితే ఈ బ్రహ్మ విద్య నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతిని పొందిన బ్రహ్మనిష్ఠుడయిన సద్గురువు వల్లే తెలియ బడుతుంది. వేదాంత పుస్తకాలు, ఉపనిషత్తులు మొదలయిన ఎన్ని పుస్తకాలు చదివినా గురుబోధలేనిదే వచ్చేది కాదు. ఈ రోజుల్లో పైనున్న వేష భాషలు చూచి, వేదాంత భాషలో వారి పాండిత్య మహిమను చూసి, సమాధి ద్వారా ఆత్మను పొంది విజ్ఞానము సంపాదించని వారిని భ్రమతో గురువుగా స్వీకరించి తద్వారా సాధన చేయటం నిష్ప్రయోజనమవుతుంది. ఒక అంధుడు రెండవ అంధునికి దారి చూపి తీసుకువెళ్లలేడు కదా! ఎందు చేతనంటే ఆ వేషధారి అయిన గురువే స్వస్వరూపమును అనుభవించలేదు కాబట్టి.

బ్రహ్మ నిష్ఠుడయిన గురువు, మనలో తీవ్ర ముముక్షుత్వము మోక్షము పొందాలనే తత్పరత, ఉంటే మన పుణ్యపరి పాకము వలన, మనకు లభ్యమవుతాడు. ఈ విధంగా మనలో శుభేచ్ఛ తీవ్ర స్థాయి చేరబట్టి మన అదృష్టమువలన మహాయోగి సద్గురువు శ్రీ శ్రీ శ్రీ స్వామి రామనాథ్ గారిని దర్శించే భాగ్యము 20 సంవత్సరాల క్రితం జరిగింది.

వారు హైదరాబాదులో ఉండేవారు. వారు నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మనుబొంది సహజ సమాధి స్థితిలో ఉండునట్టి మహనీయులు. అపార కరుణా సముద్రులు. మహాశక్తి సంపన్నులు. బ్రహ్మ విద్య పిపాసియై ఎవరు వెళ్లినా కరుణతో ఆదరించి వారికి మహావాక్యోపదేశమిచ్చి వారి పురోభివృద్ధికి పాటు బడిన మహాత్ములు. వారికి వీరు వారు అనే భేద బుద్ధి లేదు. నిరాడంబరులు. బ్రహ్మ విద్యపై, విదేహ కైవల్యం భూమికా తరంగిణి, శ్రీగురు దేవుల సుభాషితాలు, కఠోపనిషత్తుపై వ్యాఖ్య మొదలైన పెక్కు గ్రంథములు సరళి శైలిలో సామాన్యునకు తెలియునట్లుగా స్వంత ఖర్చుపై ముద్రించి ముముక్షువులందరకు ఉచితముగా పంచి పెట్టిన మహనీయులు. వారి గృహము ఎల్లప్పుడు శిష్యులతో వేదాంతగోష్ఠి, వేదాంతోపన్యాసములు ఇచ్చుచు ఎల్లప్పుడు కళ కళలాడుతూ ఉండేది. శిష్యులను తరింప చేయుటకై నిర్ణీత సమయములనే సూత్రము పాటించకుండా విరామము లేకుండా ఎల్లప్పుడు అందుబాటులో ఉండేవారు. నిగర్వి. వారి హస్తమస్తక సంయోగము చేత సాధకుల అజ్ఞానమును భస్మమొనరించి నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతి కలుగచేసి జ్ఞాన సంపన్నులుగా తీర్చి దిద్దిన బ్రహ్మ నిష్ఠులు. కాని మా దురదృష్ట వశాత్తు వారు 20 సంవత్సరముల పూర్వమే బ్రహ్మైక్యమయినారు.

వారి శిష్యులు ముఖ్యులు శ్రీమతి వడ్డి వరలక్ష్మమ్మగారు. గురువు గారి అడుగు జాడలలో నడచుకుంటూ అనేకమంది శిష్యులను తరింప చేశారు. సుమారు 20 సంవత్సరములనుండి సంవత్సరానికి 2 పర్యాయములు అంటే గురువుగారి ఆరాధన సమయమున, గురు పౌర్ణమి రోజున శ్రమ అనుకోకుండా హైదరాబాదునుండి వచ్చి మాకు ఆత్మబోధగావిస్తూ మమ్ములను తేజోవంతులను చేస్తున్నారు. వైరాగ్యమంటే ఆలుబిడ్డలను, గృహమును విడిచి పోవటం కాదు, గృహంలోనే ఉంటూ సంకల్ప త్యాగముచే తీవ్ర వైరాగ్యస్థాయికి చేరవచ్చునని అంటే అది ఎలాగంటే, నావ ఏవిధంగా నదిలో ఉన్నప్పటికి నీరు నావలోకి రాకుండా ఏ విధంగా జాగ్రత్త పడాలో అదే విధంగా సంసారంలో ఉంటూ సంసారం అంటుకోకుండా ఉండవచ్చునని నిరూపించి మమ్ములను చరితార్థులను చేయుచున్నారు. వచ్చినప్పుడల్లా నాల్గురోజులుండి ఉపన్యాసాల ద్వారా బోధ చేస్తూ, కొత్తగా వచ్చిన వారికి మహా వాక్యోపదేశము చేస్తూ శక్తి పాతము ద్వారా వారి వారి సంస్కారములను బట్టి ఆత్మానుభూతిని కలుగచేయుచున్నారు. గత సభలో నాల్గు

రోజులపాటు జరిగిన వేదాంతోపన్యాసములు కేసెట్టులలో రికార్డు చేసుకొని అందున్న ముఖ్య విషయములు ఈ పుస్తకరూపముగా మేము అంటే బాపట్ల బ్రహ్మ సభ్యులు అచ్చువేయించి మా ఉపయోగార్థమై పంచుటకు నిశ్చయించినాము. ఆ నిశ్చయాత్మక క్రియా రూపమే ఈ పుస్తకము. దీని ధర అమూల్యము. ముముక్షువులకు తగిన తపాలా బిళ్లలు పంపితే ఉన్న స్టాకు పరిమితిని బట్టి పుస్తకము ఉచితముగా పంపబడును. కొంత మందయినా ఈ తత్త్వ బోధను అవగాహన చేసుకుని స్వస్వరూప స్థితిని పొందినచో మా ప్రయత్నము ఫలించినట్లే. సద్గురువు శ్రీమతి వరలక్ష్మి గారి ఉపన్యాసములు కేసెట్లలో రికార్డు చేసి, ఆ క్యాసెట్లనుండి ముఖ్య విషయములన్ని క్రమ పద్ధతిలో అమర్చి కృషి సల్పిన శ్రీ రాఘవ శర్మగార్ని బ్రహ్మ సభ్యులందరు అభినందిస్తున్నారు. ఆ ఉపన్యాసములు ఏ రోజుకారోజు క్రమ పద్ధతిలో అమర్చబడమయినది. ప్రతి సంవత్సరములో ఈ రెండు రోజులేకాక బ్రహ్మ సభ్యులందరూ ప్రతి రోజు మధ్యాహ్నం 2 గంటలనుండి 5 గంటలవరకూ మాత్ర సమానురాలయిన శ్రీ సత్యకామగారింట్లో సమావేశమై, శ్రీమతి సత్యకామగారు, శ్రీ రాఘవ శర్మగారు, శ్రీమతి కమలమూర్తిగారి అధ్యక్షతలో ప్రవచనము చేసుకుంటున్నాము. పై ముగ్గురకు బ్రహ్మ సభ్యులందరము కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము. ఈ వేదాంత సభలు దిగ్విజయముగా చిరకాలము కొనసాగాలని గురుదేవుని ప్రార్థిస్తున్నాము.

ఈ పుస్తకము అందముగా తీర్చి దిద్ది తక్కువ వ్యవధిలో అచ్చువేసి ఇచ్చిన జాయ్ 'ఎన్' జాయ్ ప్రింటింగ్ ప్రెస్ వారికి, వారి సిబ్బందికి హృదయ పూర్వక ధన్యవాదములు.

ఇట్లు
బాపట్ల బ్రహ్మ సభ్యులు



శ్రీ సద్గురు వరలక్ష్మి మాత

1. గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వర
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ||

2. సదా శివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతం వందే గురుం పరం పరాం ||

3. నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ||

4. ఓం నమో బ్రహ్మాధిభ్యో బ్రహ్మ విద్యా సంప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో గురుభ్యోనమో మహద్భ్యః
సర్వో పద్రవ రహిత ప్రజ్ఞాన ఘనః
ప్రత్యగర్థో బ్రహ్మై వాహమస్మి ||

5. ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూరణ మదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయా
పూర్ణ మేవా వశిష్యతేః ||

6. ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం
కరవావహై, తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై ||

ఓం శాన్తి, శ్శాన్తి, శ్శాన్తిః

# విషయసూచిక

| | విషయ ప్రస్తావన | పేజి నంబర్లు |
|---|---|---|

# బ్రహ్మజ్ఞానావలీమాలా

## (బ్రహ్మనామావలీమాలా)

సకృత్ శ్రవణమాత్రేణ బ్రహ్మజ్ఞానం యతో భవేత్,
బ్రహ్మజ్ఞానావలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే.

అసఙ్గోఽహ.నుసఙ్గోఽహమసఙ్గోహం పునః పునః,
సచ్చిదానన్దరూపోఽహమహమే వాహావ్యయః.

నిత్యశుద్ధవిముక్తోఽహం నిరాకారోఽహమక్షరః,
భూమానన్దస్వరూపోఽహమహమేవాహ మవ్యయః.

నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహమక్షరః,
పరమానన్దరూపోఽహమహ మేవాహ మవ్యయః.

శుద్ధచైతన్యరూపోఽహమాత్మారామోఽహమేవ చ,
అఖణ్డానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః

స్వయం ప్రకాశరూపోఽహం చిన్మయోఽహం పరోఽస్మ్యహం,
అద్వైతానన్దరూపోఽహ మహమెవాహ మవ్యయః.

ప్రత్యక్ చైతన్యరూపోఽహం శాన్తోఽహం ప్రకృతేః పరః,
శాశ్వతానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః.

తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరః శివః.
మాయాతీతః పరంజ్యోతి రహమేవాహ మవ్యయః.

నామరూపవ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః,
సుఖ ప్రకాశరూపోఽహ మహమేవాహ మవ్యయః.

# ఒకటవ రోజు ఉపన్యాసము

**ప్రియాత్మ బంధువులారా!** ఇప్పటికి దాదాపు 20 సంవత్సరములనుండి సంవత్సరమునకు రెండు పర్యాయములచొప్పున అంటే ప్రతి సంవత్సరము గురువుగారి ఆరాధన రోజున గురు పౌర్ణమి రోజున జ్ఞాన యజ్ఞాన్ని జరుపుకుంటున్నాము. నాకు జ్ఞప్తి ఉన్నంతవరకు ఇది 41వ జ్ఞాన యజ్ఞము. మనమంతా వేదాంతపరి భాషలోగాని, సంస్కృత విద్యలోగాని పాండిత్యం లేకపోయినా సద్గురువు మహాయోగి శ్రీశ్రీశ్రీ రామనాథ్ గారి దయవల్ల వారి బోధల వలన మనలో కొంతమంది ఆత్మానుభూతిని నిర్వికల్ప సమాధి ద్వారా పొంది మన అనుభవాలు ఒకరికొకరు చెప్పుకుంటూ కొత్తగా వచ్చినవారికి ఆత్మబోధ చేసి మహా వాక్యోపదేశము చేస్తూ జ్ఞాన యజ్ఞాన్ని నిర్విఘ్నంగా జరుపుకుంటున్నాము. ఇదీ అంతా ఆ గురువుగారి అపార కృప.

ఈ సందర్భంలో ముఖ్యంగా మరో విషయం చెప్పాలి. ఈ జ్ఞాన యజ్ఞాన్ని కీ.శే. శ్రీశ్రీశ్రీ బొడ్డుపల్లి సీతారామ స్వామి గారింట్లో జరుపుకుంటున్నాము. శ్రీ సీతారామస్వామి గారు వారి సతీమణి శ్రీమతి సత్యకామగారు చాలా పుణ్య దంపతులు. ఆత్మానుభూతి పొందిన మహనీయులు. అనేక సత్పురుషులను, సాధుపుంగవులను దర్శించుకున్న పుణ్యాత్ములు. జ్ఞాన పిపాసకులు. నిష్కామ కర్మయోగులు, అచంచల దైవ భక్తులు. వారి కుటుంబ సభ్యులుకూడా ఆ మార్గములోనే పయనిస్తున్నారు. కాబట్టే శ్రీ సీతారామ స్వామి గారు బ్రహ్మైక్యమయినప్పటికి వారి సతీమణి సత్యకామగారు, వారి కుటుంబ సభ్యులందరూ ఈ జ్ఞాన సభలను వారింట్లో శ్రమ అనుకోకుండా నిర్విఘ్నంగా జరుపుటకు ఏర్పాటు చేస్తున్నారు. మనందరకు ఆమె మాతృ సమానురాలు. వారు ఈ విధంగా ముముక్షువులయిన మనకు సేవ చేస్తూ ఆత్మలో నిలకడ కలిగి యుండి వారి గృహమును ఒక ఆశ్రమముగా తీర్చి దిద్దారు. అటువంటి వారి సాంగత్యము దొరకటం మన పూర్వ జన్మల పుణ్యఫలమేకదా! వారికి మనమంతా కృతజ్ఞులమై ఉండాలి. వారికి వారి కుటుంబ సభ్యులకు మనమంతా కృతజ్ఞత తెలుపుకుంటూ

వారందరకూ ధర్మార్థ కామ మోక్షాలను, భక్తి జ్ఞానవైరాగ్యాలు ప్రసాదించి మోక్షార్హులను చేయాలని ఆ గురుదేవుని ప్రార్థిస్తూ పాఠం మొదలు పెడదాం.

**పరిశుద్ధాత్మ స్వరూపులారా!** మనలో కొంత మంది తత్త్వ బోధను విందామని, మనతో మనం అనుభవించుచున్న ఆత్మానుభవంతో పాలు పంచుకుందామని, ఆ పరమాత్మ స్వరూపమెట్టిది, నా స్వరూపమేమిటి, అని తెలుసుకుందామని జిజ్ఞాసతో వచ్చారు. వారు కొత్త వారయినప్పటికి వారికి కూడా మన సభ ఉపయోగ కరంగా ఉండాలికదా! వారిని కూడా మనలో చేర్చుకొని తత్త్వ బోధ చేసి వారిని కూడా మోక్షసామ్రాజ్యము పొందటానికి వారి ప్రయత్నములలో తగు సహాయము చేయాలికదా! అందుచేత ఈ జ్ఞాన యజ్ఞం మొదటి రెండు రోజులు, మానవ జన్మ ప్రాముఖ్యత, పంచకోశ విచారణ, శరీర త్రయవివరణ మొదలైన ప్రథమ అంశాలని చర్చించుకుందాం. ఆ అంశాలుపై ఇదివరలో బోధ జరిగి, మీరు పురోగతి సాధించినా ఇంకొకసారి చెప్పుకోవటంలో తప్పులేదు. వేదాంతంలో పునరుక్తి దోషం లేదు. దాని వలన లోగడ ఈ అంశాలు విన్న వారికి బోధ గట్టి పడుతుంది. కొత్త వారికి మార్గము చూపించినట్లుగా ఉంటుంది. అందుచేత మొదట మానవ జన్మ దాని ప్రాముఖ్యత వివరిస్తాను.

ఎనుబది నాలుగు లక్షల జీవరాశులలోనూ మానవ జన్మ చాలా ఉత్కృష్ట మయినది. అనేక జన్మల పుణ్య పరిపాకమువలన మానవ జన్మవస్తుంది. ఎందుచేతంటే యుక్తా యుక్త విచక్షణా జ్ఞానం, ధర్మా ధర్మముల పరిజ్ఞానము, కర్మలు వాటి ఫలితాలు, తర్కించుకొనే శక్తిగలిగిన బుద్ధి భగవంతుడు ప్రసాదించాడు. ఇట్టి విచక్షణా జ్ఞానము ఇతర జీవులకు లేదు. అవి కేవలం ప్రారబ్ధకర్మ అనుభవించటానికే పుట్టాయి. అందుచే వాటికి మోక్ష సాధన చేయగలశక్తి లేదు. కాని మానవుడు మాత్రము తాను తెచ్చుకొన్న ప్రారబ్ధకర్మను అనుభవిస్తూ, నిష్కామ కర్మయోగము, భక్తి జ్ఞాన వైరాగ్యములను అవలంబించి నిత్యానిత్యవివేక జ్ఞానముతో పునర్జన్మ లేని మోక్ష సాధన చేయుటానికి వీలుండి తన బుద్ధిని సద్వినియోగ పరుస్తున్నది. అందుచేతనే దేవతలు కూడా మోక్షసాధనకు మానవ జన్మ కోరుకుంటారని నానుడి. వారు వారు చేసుకున్న పుణ్యఫలములను అనుభవించటం

ద్వారా క్షీణించగా తిరిగి మానవ జన్మ ద్వారానే మోక్ష సాధన చేయవలె. అనేక జన్మలలో సంపాదించిన పుణ్యఫలమును వెచ్చించి తెచ్చుకున్న మానవ జన్మను సార్థకము చేసుకోవాలంటే పునర్జన్మలేని మోక్షమార్గములో తీవ్ర ముముక్షత్వముతో పయనించి మోక్షము పొందాలి. అంతే కాని ఇంద్రియలోలుడై యుక్తా యుక్త విచక్షణా జ్ఞానమును కోల్పోయి, పాపభీతిలేక ద్విపాద పశువువలె దుష్కర్మలనాచరిస్తే తిరిగి మానవ జన్మ రాదు సరికదా 84 లక్షల జీవరాశులలో చేసుకున్న కర్మ ఫలితాలను అనుభవించటానికి ఏదో ఒక జన్మ, పశు క్రిమి కీటకాదులలో జన్మించవలసి వస్తుంది. ఈ విధంగా జన్మ మరణ చక్రంలో పరిభ్రమించవలసిందే.

ఈ విశ్వ ప్రపంచమంతా కర్మ సిద్ధాంతముపై ఆధారపడి ఉంది. మంచికి మంచి చెడుకు చెడు ఫలితాలు వస్తాయి. అది అనివార్యం. మామిడి టెంక నాటితే మామిడి చెట్టే మొలుస్తుంది. తాటి టెంక నాటితే తాటిచెట్టే మొలుస్తుంది. తాటి టెంక నాటి మామిడి చెట్టును ఆశిస్తే ఫలించదు. అదే విధంగా దుష్కర్మలకు చెడు ఫలితాలు అంటే కష్టాలు కల్గుతాయి అలాగే పుణ్యకర్మలకు పుణ్య ఫలితాలయిన సుఖ సంతోషాలు కలుగుతాయి. ఈ వచ్చిన జన్మ రాబోయే జన్మ అందులో అనుభవించే కష్టాలు, సుఖ సంతోషాలు మనము స్వయంగా కర్తృత్వ భావనతో చేసుకున్న కర్మ ఫలితాలు తప్ప వేరుకాదు. కొన్ని కర్మ ఫలితాలు వెంటనే అనుభవానికి వస్తాయి. కొన్ని జన్మాంతరంలో కలుగుతాయి. ఉదాహరణకి. అన్నంవండి తినటం అనేకర్మ చేశాము. అది పచనమయి, రక్త, మాంసము, మేధస్సు వగైరాలలో కలవటానికి కొంచెం వ్యవధి కావాలసి వస్తుంది సుమారు 2 గంటలు. కొన్ని కర్మ ఫలితాలు వెంటనే అనుభవానికి వస్తాయి. అందుచేత అనేక జన్మల పుణ్యాన్ని వెచ్చించి తెచ్చుకున్న మానవ జన్మను పునర్జన్మలేని మోక్షప్రాప్తికి సద్వినియోగ పరచుకోవాలి. ఇదే మానవ కర్తవ్యము.

**ప్రేమ స్వరూపులారా!** వేదాంతశాస్త్రానికి బ్రహ్మమే విషయము. మోక్షమే ప్రయోజనము. బ్రహ్మ జ్ఞానానికి సాధన చతుష్టయ సంపన్నుడే అధికారి. సాధన చతుష్టయమంటే

(i) నిత్యానిత్య వస్తు వివేకము.

(ii) ఇహ మంత్ర ఫల భోగవిరాగము

(iii) శమ దమాది షట్క సంపత్తి

(iv) ముముక్షత్వం

ఈ నాలుగూ బ్రహ్మ జ్ఞానానికి సాధనాలు. అనుభవం ద్వారా బ్రహ్మమెరిగిన వాడు బ్రహ్మే పోతాడు. అపుడే సర్వకర్మ బంధాలనుండి విడివడి మోక్షార్హుడవుతాడు. ఇది నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతిని పొంది మోక్ష పదవిని పొందాలి. అంతేకాని సంతానం వల్ల కాని, ధనం చేతకాని, దానం చేత కాని, యజ్ఞకర్మల చేతకాని, తీర్థ యాత్రలవలన గాని, మోక్షం పొందలేము.

**(i) నాన్య పంథా అయనాయ విద్యతే**

**(ii) నకర్మణా నప్రజయాధనేన, త్యాగే నైకేన అమృతత్వ మానసుః**

అని ఘోషిస్తున్నాయి ఉపనిషత్తులు. సంచిత కర్మ ఫలితాలు శేషం ఉన్నంత వరకూ మోక్షం ప్రాప్తించదు. అవి నిశ్శేషమవాలి. అది నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మసాక్షాత్కారమవుతేనే కాని కర్మ ఫలితాలు నిశ్శేషం కావు.

మానవుడై పుట్టినందుకు ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో మోక్షమే పరమ పురుషార్థం. ఇది సాధించకుండా జీవితం వ్యర్థంగా గడిపితే మానవ జన్మను వ్యర్థము చేసుకున్నట్లే. మళ్లీ మానవ జన్మవస్తుందని నమ్మకం లేదు. అందుచే ఈ జన్మలో పురుష యత్నంతో, తీవ్ర సాధన చేసి నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మసాక్షాత్కారం పొంది కర్మ ఫలితాలను భస్మం చేసుకొని దుఃఖనివారణ అఖండానంద ప్రాప్తి అనే మోక్ష పదానికి చేర్చాలి. అప్పుడే పునర్జన్మ ఉండదు. జన్మరాహిత్య మవుతుంది. అదే మానవ కర్తవ్యం.

ఇంద్రియాలు, మనస్సు బహిర్ముఖమై విషయవాంఛలపై పరుగిడుతున్న కాలం మోక్ష మార్గంలో ప్రవేశించలేరు. జ్ఞానమొక్కటే మోక్ష సాధనము. కాంతి చీకటిని పోగొట్టునట్లు జ్ఞానమే అవిద్యను తొలగిస్తుంది. దీనికి నిష్కామ కర్మయొక్క యోగం తోడవాలి.

వినయువము, నమ్రత, పరోపకారబుద్ధి, కర్తృత్వాభిమానం లేని దానం, శౌచత్వము, అహింస, భూతదయ, తృప్తి, తీవ్ర మోక్షాపేక్ష మొదలయిన దైవ సంపదలు చిత్తశుద్ధి కలుగచేస్తాయి. చిత్త శుద్ధికలుగనంతవరకు స్వస్వరూపానుభవము అంటే ఆత్మ సాక్షాత్కారము కలుగదు.

విషయ వాంఛాపరిత్యాగమే వైరాగ్యము. వైరాగ్యము గత జన్మలలో చేసుకున్న పుణ్యపరిపాకంవల్ల కల్గుతుంది. అదిలేనిదే మోక్షప్రాప్తి కలుగదు. సర్వసంగ పరిత్యాగము చేసితిని అనుకుంటే అక్కడ ఇంకా అహంకారముంది. అందుచేత అది త్యాగము పరిపూర్ణము కాలేదు. అది వైరాగ్యమనిపించుకోదు. కాబట్టి అహంకార త్యాగమే పూర్తి వైరాగ్యము. 'అహం అంటే 'నేను' అంటే ఆత్మ. నేను లేను అనేవాడు ఎవడూ లేడు. సకల జీవకోటి 'నేను' 'నేను' అని సంబోధించు కుంటుంది. అంటే అందరిలో సర్వాంతర్యామిగా ఆ 'నేను' అంటే 'ఆత్మ' ఉన్నది. ఆ ఆత్మ చైతన్యశక్తి వలననే అంతఃకరణ ప్రేరేపింపబడి పూర్వవాసనల కారణంగా పని చేస్తోంది. ఈ 'అహం'కు. నామ రూపాత్మకజగత్తుకు ప్రాధాన్యత ఇచ్చి ఆకారం కల్పించుకుంటే 'అహంకారం' అవుతుంది. ఈ అహంకారం కూడా 'అహం'లో నుండి వచ్చింది. సర్వ అనర్థాలకు ఈ అహంకారమే మూలకారణము. అందుచేత పురోభివృద్ధి కల్గి మోక్షగామి కాదలచుకున్నవాడు అహంకారాన్ని త్యజించాలి. సర్వ వేళలలో 'అహం'లో నిలకడ కల్గి ఉండాలి. నామ రూపాత్మక జగత్తుకు ప్రాధాన్యత ఇవ్వకుండా వారిలో ఉన్న 'అహం' అంటే చైతన్య శక్తినే దర్శించాలి. ఇదే నిజమైన వైరాగ్యము.

భ్రాంతి అంటే భ్రమ ఉన్నంత వరకూ మోక్షప్రాప్తి కలుగదు. భ్రాంతి అంటే అంతఃకరణవేరు 'ఆత్మ' అంటే 'నేను' వేరు అని తెలుసుకోకపోవడం. దేహాభిమానం ఒక భ్రాంతి. కుటుంబాభిమానం ఒక భ్రాంతి. ధనాభిమానం ఒక భ్రాంతి. అధికారాభిమానం ఒక భ్రాంతి. ఇన్ని భ్రమలతో కూడుకున్న వాడికి బ్రహ్మ సాక్షాత్కారమెలా అవుతుంది? మీకు అశాశ్వతమైన జగత్తుపై విశ్వాస మున్నంతవరకూ ఆత్మ సాక్షాత్కారముకాదు.

తీవ్ర మోక్షాపేక్ష కల ముముక్షువు ఒక ముఖ్య విషయం గమనించాలి.

(i) 'ఆత్మ' అంటే 'నేను' అంటే 'బ్రహ్మ' శాశ్వతుడు. మార్పు చెందడు.

సర్వసాక్షి-కూటస్థుడు. ఈ దృశ్య మానవజగత్తు అంటే శరీరము శరీర సంఘాతము మూడు ఏదయితే చూడబడుతోందో అవి శాశ్వతము కాదు. ఎప్పుడూ మార్పు చెందుతాయి. దేహము దేహ సంఘాతము జగత్తు అన్నీ మార్పు చెందేవే. అవి అశాశ్వతము. అందుచేత శాశ్వతుడయిన "నేను" అంటే ఆత్మ అశాశ్వతమైనటువంటి త్రిగుణాలతో నిండినట్టి జగత్తును శాశ్వతమని భ్రమించి వాటి నామ రూపాలను విశ్వసించి 'నేను' కు అంటే 'అహం'కు ఆకారం కల్పించుకొని అంటే అహంకారముతో చేయు ప్రతి కర్మ బంధహేతువవుతుంది. ఆ భ్రమ, భ్రాంతి, అటువంటి విశ్వాసము వైరాగ్యముతో త్యజిస్తేనే కాని మోక్షము కలుగదు. నిజమైన సన్యాసం అహంభావాన్ని విడిచిపెట్టి సంకల్ప త్యాగం చెయ్యటమే. నిజమైన ఏకాంతం సంకల్పాలు లేని మానసిక ఒంటరి తనమే. అంతే గాని గృహము విడిచి పోవటం అరణ్యాలకు పోవటం కాదు. గృహంలో ఉంటూనే మానసిక సంకల్పాలు త్యాగంతో అహం భావాన్ని విడిచి 'అహం'లో ఆకారాన్ని కల్పించకుండా ఉండటమే. మనో వాంఛలున్నవాడు వాడెక్కడున్నా ఏకాంతంగా ఉండలేడు. మమకారం లేనివాడు, మోహం లేని వాడు అనురక్తి లేకుండా తన విద్యుక్త ధర్మాన్ని శ్రద్ధగా నిష్కామంగా దైవ కార్యంగా చేస్తున్న వాడు ఏకాంతంగా ఉన్నవాడే. ఆ పని అతనికి ప్రతి బంధకము కాదు. పైగా మనస్సు పరిశుద్ధమవుతుంది. నేను గృహస్థుడను అని అనుకుంటే గృహస్థుడననే భావం నీలో నాటుకొని ఆ విధంగా భావన ఉంటుంది. నేను సన్యాసిని అని అనుకుంటే సన్యాస భావన నిలుస్తుంది. ఏ భావన లేని స్థితే నిజమైన సన్యాసం. కాబట్టి తేలేదేమంటే ఏ భావన లేకుండా నిస్సంకల్ప స్థితిలో ఉండటమే అంటే సంకల్ప త్యాగము చెయ్యటమే నిజమైన వైరాగ్యము.

**కాబట్టి సచ్చిదానంద స్వరూపులారా!** అసలు మోక్షమంటే ఏమిటి? బంధాలనుండి విడి వడటమే మోక్షము. ఉదాహరణ ఒకనిని ఒక స్తంభానికి బలమైన త్రాళ్లతో కట్టి వేశారు అనుకోండి. అంటే అతను బంధితుడయ్యాడు. ఆ త్రాటి బంధాల ముళ్లు విప్పి బంధాలను తీసివేస్తే బంధాలనుండి విడిచి పుచ్చినపుడు ఆ బంధాలనుండి మోక్షం పొందాడు. అయితే వేదాంత పరిభాషలో బంధాలంటే పూర్వ జన్మవాసనలతో మిధ్యారూప మానవమయిన త్రిగుణాలలో నుండి నామరూపాలతో ఉన్న జగత్తుని విశ్వాసంతో, శాశ్వతమని నమ్మి 'అహం' అంటే

"నేను" కు ఆకారం కల్పించుకొని అహంకారంతో తాను అంతఃకరణతో ఏకీభవించి దాని ధర్మాలు తన మీద వేసుకొని, త్రిగుణాలకు లోనయి మోహంతో కోర్కెలు పెంచుకొని కామ క్రోధాలనెడి ద్వంద్వాలకు లోనయి, కర్తృత్వాభిమానంతో దేహాభిమానంతో, స్వయంగా కర్మలాచరించి ఆ కర్మ ఫలితాలనే బంధాలు నీకు నీవే ఎవరి ప్రమేయం లేకుండా బంధించుకున్నావు. ఆ బంధాలు ఎవరో బిగించినవి కావు. దానికి ఆ భగవంతుడు కూడా కారణం కాదు. ఆ విధంగా వాసనలతో కర్మ లాచరించిన బంధాలే జన్మ మరణాలకు కారణమవుతున్నాయి. ఆ బంధాల్ని నీవే పురుష యత్నంతో తెంచుకొని కర్మ ఫలిత రాహిత్యం చేసుకుంటేనే నిశ్శేషమయి మోక్షం పొందుతావు.

సద్గురువు కూడా ఆ మోక్ష మార్గానికి తత్త్వ బోధచేసి మార్గము చూపగలడే కాని, నీవు ఆ గురూపదేశము ద్వారా నీ బంధాలనుండి నీవే విడిపించుకొని మోక్షము సంపాదించుకోవాలి. కొడుకులుగాని, ధనం గాని, మంది మార్బల సిబ్బంది గాని, బంధువులు గాని ఎవరూ కూడా నీ బంధాలనుండి విముక్తుని చేయలేరు. సద్గురువు మాత్రమే నీకు సుమార్గము చూపగలడు. కాబట్టి బ్రహ్మనిష్ఠుడయిన సద్గురువు కోసం తీవ్ర ముముక్షత్వంతో అన్వేషించాలి. అంతకంటే మార్గము లేదు.

**పరిశుద్ధాత్మ స్వరూపులారా!** మోక్ష సాధనకు కావలసినది తీవ్ర ముముక్షత్వము ముఖ్యము. గురు బోధ యందు సంశయ భావన, అసంభావన, విపరీత భావన అనే మూడు ప్రతిబంధకాలు కలుగుతాయి. గురుబోధను చెప్పింది చెప్పినట్లుగా విశ్వసించి సాధన చేసే వారికి మోక్షము కరతలామలకమవుతుంది. నీయందు, గురువు యందు, గురు బోధయందు అచంచలమైన విశ్వాసముండాలి.

సంశయ భావనంటే ఆత్మతత్త్వం అంతా ఒకటేనా అని సంశయించటం. ఇది వేదాంత సద్గురువు తత్త్వ బోధ శ్రవణం ద్వారా తొలగుతుంది, పరిపూర్ణ విశ్వాసముంటే. అసంభావనంటే జీవుడు, ఈశ్వరుడు, జగత్తు పురాణాల్లో చెప్పినట్లు సత్యంగా కనిపిస్తుండగా అద్వైతం ఎట్లా అవుతుంది అనే భావన కలగటం. **'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ-నేహ నానాస్తికించన'** అని గురు బోధ చేస్తుంటే ఆ వాక్యాన్ని సంశయించటం. ఇటువంటి అసంభావనలన్నీ స్వప్న దృష్టాంతాది యుక్తా యుక్తమైన మననం చేత పోతుంది. మననం అంటే విచారణ అంటే శ్రవణం

వల్ల కలిగే బోధను యుక్తులతో చింతన చేయటం.

విపరీత భావన నిధి ధ్యాస చేత పోతుంది. అపుడు నేను బ్రహ్మమును **'అహం బ్రహ్మాస్మి'** అని విశ్వసించటం వలన పరోక్ష జ్ఞానం కలుగుతుంది. ఈ విధంగా అసత్యావరణ తొలగిపోతుంది. పరోక్ష జ్ఞానం వలన కూడా ప్రయోజనం లేదు. పరోక్ష జ్ఞానం అంటే చెప్పింది విశ్వసించి నమ్మటం. ఉదాహరణకి ఒకడు నర్మదా నదిలో స్నానం చేసి వచ్చాడని చెప్పగానే నర్మదా నది అని ఒకటున్నది. అది ఫలానా చోట ఉన్నది అని తెలుసుకోవటం. ఈ పరోక్ష జ్ఞానం చేత బ్రహ్మములేదు అని అనుకోవడానికి కారణమయిన అసత్యావరణ తొలగిపోతుంది. ఇంకొక ఉదాహరణ. ఒకడు చీకటిలో దీపం దీపం అంటూ కూర్చుంటే దారి కనిపించదు. అందుచేత పరోక్ష జ్ఞానం వల్ల ఆత్మాభిలబ్ది కాదు. అ పరోక్ష జ్ఞానం వలననే జ్ఞానం కలుగుతుంది. కాబట్టి నిధి ధ్యాసతో అ భావానంతరణ తొలగి నేనే బ్రహ్మమును నిర్వికల్ప సమాధివలన అపరోక్ష జ్ఞానం కలుగుతుంది. వెంటనే దుఃఖ నివృత్తి అఖండానంద ప్రాప్తి కలుగుతుంది. ఇది ఒకసారి కలుగగానే సంచిత కర్మ ఫలాల సముదాయమంతా భస్మీపటలం అయి నిశ్శేష మవుతుంది. ముముక్షువు ప్రారబ్ధ కర్మను శరీరానికి వదలి సాక్షీ భూతుడుగా ఉంటాడు. ప్రారబ్ధ కర్మ విడిచిపెట్టిన బాణం లాంటిది కాబట్టి అది శరీరము అనుభవిస్తేనే కాని తరగదు. ఆగామి కర్మ ఫలితాలు అంటుకోవు. నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతి కలిగిన తరువాత చేసిన కర్మలు నిష్కామ కర్మలు కాబట్టి కర్తృత్వ రహిత కర్మలు కాబట్టి. ఆ గామి కర్మ ఫలితాలకు లోనుకాడు.

ఈ విధంగా తీవ్ర ముముక్షువు పురుష యత్నంతో తీవ్ర సాధన చేస్తాడు. కొంత మంది, నీవు సాక్షివి 'అహంబ్రహ్మాస్మి' అని ఒప్పుకోబుద్ధి వేయటం లేదు. పూర్వవిధంగా నేను శరీరాన్ని అని గట్టి నమ్మకంలో ఉంటూ పరమాత్మ వేరు నేను వేరు అని సాధన చేస్తున్నారు. ఈ విధంగా చేయుటం వలన ఈ మంద ముముక్షువులకు నిర్వికల్ప సమాధి కలుగదు. జన్మ పరం పరలలో చిక్కుకుంటున్నారు. ఎంత వేదాంత పరిజ్ఞానమున్న వానికి కూడా తన జ్ఞాతుల మరణ వార్త వినగానే అజ్ఞాతమృతా శౌచము నిరాకారమైనప్పటికి తన్నావరించినట్లు దృఢముగా నమ్ముతాడుగాని నీవు ఆపరమాత్మ స్వరూపుడవు అని తత్త్వమసి అనే

మహా వాక్యాన్ని ఎంత బోధించిన ఉపనిషత్ మహా వాక్యాన్ని నమ్మడు. ఆ విధంగానే ఏదయినా దేవాలయము వద్ద ఈ దేవునికి భక్తి ప్రవృత్తులతో పూజిస్తేనే కోర్కెలు నెరవేరుతాయి అని పూజారి బోధిస్తే అది నమ్ముతాడుగాని తత్త్వమస్యాది వాక్యాన్ని శృతి బోధించినా దాని యందు విశ్వాసవుుంచడు. ఈ పూజలు కూడా యాదృచ్ఛికంగా శివకేశవులకు భేదం కల్పించుకొని పూజలు చేస్తూ ఆధ్యాత్మికంగా పురోగమించలేక పోతున్నాడు. ఈ నామరూపాత్మికమైన జగత్తు చూసి నామ రూపాత్మలకి ప్రాధాన్యత ఇచ్చి వాటిపై నమ్మక భావాలు ఏర్పరచుకొని జీవేశ్వరుల భేదము (ద్వైత భావన) సృష్టించుకున్నంత కాలం సాధనలో పురోగమించలేరు. ఉన్నది ఒక్కటే పరబ్రహ్మ- **'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ-నేహ నానాస్తికించన'**- నిర్వికారుడు-నిష్క్రియుడు- సత్యజ్ఞానానంద స్వరూపుడు. కాని నామ రూపాత్మకమైన జగత్తు కూడా దృశ్య మానంగా ఉంది. ఇది నేను చూస్తున్నా నంటున్నాడు. తాను జీవుడను-అల్పుడను- బ్రాహ్మణుడను- వైశ్యుడను-నల్లవాణ్ని అంటున్నాడు. కాని అంతర్గతంగా ఉన్న ఆత్మకనిపించటం లేదు, తన చక్షువులకు అజ్ఞానం చేత-అవిద్యచేత. తానంటే శరీరము, మనస్సు అనుకుంటూ ఇంద్రియాలతో ఏకీభవించి కోర్కెలు పెంచుకొని నామరూపాత్మకమైన జగత్తు సత్యమని నమ్మి వాటిని అనుభవించటానికి కర్తృత్వాభిమానంతో కర్మలు చేస్తున్నాడు. అనేక జన్మలనుండి వచ్చిన ఈ సంస్కారాలను వదులుకో లేక పోతున్నాడు. ఈ విధంగా వాసనలు పెంచుకుంటూ జన్మ మరణ యంత్రములో తిరుగాడుచున్నాడు. కాని ఎప్పటికినేను ఎవరు? నా ఆకారమేమిటి? నా స్వరూపమేమిటి? నేను నిష్క్రమిస్తే ఇంతవరకు 'నేను' అనుకుంటున్న ఈ శరీరము అచేతనంగా పడి పోతుంది కదా! కంటికి అగోచరమయిన ఈ 'నేను' ఎక్కడకు పోతోంది? ఈ దృశ్యమాన జగత్తు ఎక్కడ నుంచి వచ్చింది? ఇది సృష్టించినదెవరు? ఏ ప్రయోజనం కోసం? ఈ జగత్తు కూడా అనేక మార్పులు చెందుతోంది కదా! అది ఎల్ల వేళల ఉండే నిత్య వస్తువు కాదు కదా! అని విచారించడు. అది తెలియకపోయినా తెలుసున్న బ్రహ్మ నిష్ఠుడయిన విద్వాంసుని వద్దకు పోయి వినయముతో ప్రశ్నించి తత్త్వము తెలుసుకోడు. ఎంత సేపు పూర్వ అలవాట్ల ప్రకారం యజ్ఞయాగాది సకామ కర్మలాచరిస్తూ, పూజలు, నోములు, వ్రతాలు, ఉపవాసాలు, తీర్థ యాత్రలు, నదీ స్నానాలు చేస్తూ

ఇంద్రియాల్ని తృప్తి పరుస్తూ ఉంటాడు, మూఢనమ్మకాలతో. పోనీ జాగ్రదావస్థలో చూసే జగత్తు స్వప్నావస్థలో లేదుకదా! స్వప్నావస్థలో తాను చూసినది అనుభవించినదీ అయిన జగత్తు జాగ్రదావస్థలో లేదు కదా! సుషుప్త అవస్థలో ఈ జాగ్రదావస్థలో చూసిన జగత్తు, స్వప్నావస్థలో చూసిన జగత్తు కూడా లేవు కదా! ఇది ఎట్లా జరుగుతోంది అని కూడా విచారించడు. ఇంత కాలం పోషించిన ఈ శరీరాన్ని వదలి 'నేను' వెళ్లి పోతున్నానే! ఈ శరీరానికి సంబంధించిన భార్య, కొడుకులు, కుమార్తెలు దాని సంబంధీకులెవ్వరు? వారెక్కడ నుంచి వచ్చారు? వారికి నాకు సంబంధ మేమిటి? అనికూడా విచారించడు. ఏదో యథాలాపంగా యాదృచ్ఛికంగా శిలా రూపంలో ఉన్న ఒక ఆకారాన్ని కల్పించుకొని దానికి విష్ణువని, శివుడని, అమ్మవారని, గణపతి అని పూర్వ సంస్కారబలంతో కోర్కెలతో పూజిస్తాడే గాని భగవత్స్వరూప మేమిటి? భగవంతుడు నిరాకారుడు కదా!.నిర్గుణుడు కదా! సర్వ వ్యాపికదా! అని శాస్త్రాలలో చదువుకున్నప్పటికి అటువంటి నిరాకార, నిర్గుణ, సర్వ వ్యాపి అయిన భగవంతుణ్ని తక్కువ చేసి ఆరాధన చేయుటం అపచారం కదా అని కూడా యోచించడు. దున్నపోతులకు భగవంతుడు బుద్ధిని ప్రసాదించి ఉంటే ఆ దున్న పోతు భగవంతునికి కూడా 2 కొమ్ములు కలవానినిగా ఆరాధించేవి. ఈ విధంగా ఉంటోంది పూజకూడా. పోని పూజ మంత్రాలతో శ్రద్ధ వహించక, అష్టోత్తరాలనీ, సహస్రనామాలని, స్తోత్రాలని, మేలుకొలుపులనీ ఎవరి వ్యవధిని బట్టి వారు మనస్సు లగ్నం చేయకుండా కాలం గడుపుతారు. నేను ఎవరు? నా స్వరూప మేమిటి? భగవంతుడెవరు? ఆయన ఆకారమేది? నాకు ఎంత దూరంలో ఉన్నాడు? అని కూడా విచారించడు. తెలుసుకోవటానికి ప్రయత్నించడు. ఈ విధంగా జీవితము సమాప్తమయి శరీరాన్ని చాలిస్తున్నాడు ప్రారబ్ధ కర్మ ఫలము క్షయమవగానే.

నేను ఈ జగత్తులోకి వట్టి చేతులతో వచ్చానుకదా! శరీర సంబంధీకుల కోసం నా కోసం అనేక కర్మలు కర్తృత్వాభిమానంతో ధనం కోసం, స్థిర చరాస్థుల కోసం, యశస్సు కోసం, పలుకుబడి కోసం శ్రమలు, ప్రయాసలు పడి చేశాను కదా! శరీరము విడిచి వెళ్లేటప్పుడు ఈ సంపాదనంతా ఇక్కడే వదిలి వట్టి చేతులతో పోవాలి కదా! పునర్జన్మ కలిగే కర్మ ఫలితాలు, వాసనలు, సంస్కారాలు మాత్రమే తీసుకు వెడతాను కదా! ఈ భార్యా బిడ్డలు, బంధువులు, మంది మార్బలము ఎవరూ కూడా రారు

కదా! తన యశస్సు, హోదా మొదలయినవన్నీ తనతో అంతమయి కాలగర్భంలో కలిసి పోయేవి కదా! అని కూడా యోచించడు. ఈ విధంగా తానంతటతానే కర్మ బంధాలలో చిక్కుకొని బయట పడలేక అనేక యోనిలలో జన్మించి కష్టాలకు లోనవుతున్నాడు. బంధాలు ఎవరో వేసి ముడిపెట్టినవి కావు. తనంతటతానే, పురుష యత్నంతో బ్రహ్మనిష్టుడైన సద్గురోపదేశం, తత్త్వ బోధ పొంది, కర్మ బంధాలనుండి తప్పించుకోవాలి. ఇతరులు ఎవరు సహాయము లేరు.

బ్రహ్మ నిష్టుడయిన సద్గురువుని ఆశ్రయిస్తే ఆయన అపార కృపతో తత్త్వబోధ చేసి దారిచూపగలడేగాని పురుషయత్నంతో నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మసాక్షాత్కారము పొంది నీకర్మ బంధాలనుండి నీవే విడిపించుకొని పునర్జన్మలేని మోక్షాన్ని పొందాలి. దీనికి ముఖ్యమైన అర్హతలు

(i) తీవ్ర ముముక్షుత్వము

(ii) భగవంతుని యందు, నీయందు ముఖ్యంగా బ్రహ్మనిష్టుడయిన గురు బోధయందు అచంచల విశ్వాసము

(iv) గురువు యందు అచంచలభక్తి విధేయత, నమ్రత కలిగి ఉండుట.

సాధనలో మాయ అంటే ఏమిటి మాయాకార్యము దానివల్ల కలిగే అవరోధాలు-వాటిని ఎలా నివారించుకొని దాటాలి అనే విషయాలు క్షుణ్ణంగా గురు బోధ ద్వారా శ్రవణం చేయాలి. భగవత్స్వరూపము ఎలా ఉంటుందో తెలుసుకోవాలి. దీనికి పంచకోశ విచారణ, శరీర త్రయ వివరణ అనే అంశాలపై రేపు చర్చించుకుందాం

ఓం సర్వేత్ర సుఖినస్సన్తు సర్వేసన్తు నిరామయాః ||
సర్వే భద్రాణి పశ్యన్తు మాకశ్చిద్దుః ఖమాప్నుయాత్
సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణిపశ్యతు
సర్వస్సద్బుద్ధి మాప్నోతు సర్వస్సర్వత్ర నన్దతు

ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వి నావధీత మస్తు, మా విద్విషావహై

**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

# రెండవ రోజు ఉపన్యాసము

**అఖండానందైక స్వరూపులారా!** నిన్నటి రోజున మనము మానవ జన్మ, దాని ప్రాముఖ్యత, కర్మ బంధాలు ఎలా కలుగుతాయి. ఆ బంధాలనుండి విడివడటానికి అర్హతలేమిటి అనే విషయాలు చెప్పుకున్నాము. ఈ రోజు మాయ అంటే ఏమిటి మాయా కార్యం ఎలా ఉంటుంది- భగవత్స్వరూప మేమిటి- పంచకోశ విచారణ, శరీర త్రయం వివరణ దానిని బట్టి నీ స్వస్వరూపవేమిటో బోధపడుతుంది.

ఏదీ లేదో అది మాయ. అంటే ఉన్నట్లుగా కనిపించేది. దానినే అజ్ఞానమని, అవిద్య అని, తమస్సు అని, మోహమని, మూల ప్రకృతి అని, అవ్యక్తమని, మాయ అని, భ్రాంతి అని అనేక పేర్లతో వ్యవహరిస్తారు. **'యామాసా మాయా యాని విద్యతే సా అవిద్యా'** ఈ మాయకు రెండు ప్రబలైన శక్తులున్నాయి. ఆవరణ శక్తి అని విక్షేపణశక్తి అని. ఉన్న వస్తువుని ఆవరించిలేనట్లు చేసేది ఆవరణ శక్తి. ఆవరణ శక్తి కార్యమే సంసార వృక్షానికి మూలం. లేని వస్తువును ఆరోపించి ఉన్నట్లు చేసేది విక్షేపణ శక్తి. అందుచేతనే ఉన్నది ఆపరబ్రహ్మ మాత్రమే అయినప్పటికి దాని మీద జగత్తుని ఆరోపించి వ్యవహరిస్తున్నాము. ఇది ఎలాగంటే

(i) సూర్య కాంతి తక్కువై మసక చీకటిలో తాటిని చూసి పాము అనుకొని భ్రమిస్తాడు. భయ కంపనాలకు లోనవుతాడు. అరుస్తాడు సహాయానికి. అందరూ కర్రలు పుచ్చుకొని వస్తారు ఆ పాముని చంపటానికి. నిజంగా అక్కడ పాముందా అంటే ఉంది అజ్ఞానికి. త్రాటి మీద పాము ఆరోపించబడింది. ఉన్నది త్రాడు అయితే పాము అని భ్రాంతి చెందాడు. భ్రమ చెందాడు తత్కార్యాలకు లోనయ్యాడు. కాబట్టి పాము సత్యమే అజ్ఞానికి. అయితే అది సత్యమా? ఒక జ్ఞాని కర దీపం అంటే టార్చిలైటు తీసుకు వచ్చి లైటు వేయగా త్రాడు గోచరించింది. పాము కనిపించటంలేదు. పాము ఏమయింది? దాని అధిష్టానమయిన త్రాటిలో లయమయింది. జ్ఞానికి మాత్రం త్రాడే గోచరించింది. అ జ్ఞానికి మాత్రం పాము గోచరించింది. **'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ-నేహ నానాస్తి కించన'** అదే విధంగా

పరబ్రహ్మపై జగత్తు ఆరోపించబడింది. జ్ఞాని జగత్తుని మీధ పరబ్రహ్మగానే తిలకిస్తాడు- అజ్ఞాని మాత్రం నామ రూపాత్మకమైన జగత్తు సత్యమని నమ్మి, కోర్కెలతో మోహించుకొని కర్తృత్వ భోక్తృత్వాలతో కర్మలాచరించి ఆ కర్మ ఫలితాలనుభవించటానికి జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తూ కష్టాలకు లోనవుతాడు. నిజంగా జగత్తు ఉందా? అంటే లేదు- విచారణా బలం గల జ్ఞానికి.

ఇదే మాదిరిగా వేదాంత పరిభాషలో ఇంక ఉదహరణలిచ్చారు

(i) ఎండలో మెరుస్తున్న ఆలుచిప్ప అని భ్రమించినట్లుగా

(ii) ఎడారిలో ఎండమావులను చూసి దప్పికలో నీరు అని భ్రమించినట్లుగా

(iii) చీకటిలో చెట్టు మోడును చూసి దొంగ అని భ్రమించి భయ భ్రాంతులకు లోనయినట్లుగా

(iv) తెల్లని తెరపై సినిమా బొమ్మలు కనిపించినట్లుగా, సినిమా బొమ్మలకు అధిష్ఠానము తెల్లని గుడ్డ (తెర). దానిమీద సినిమా బొమ్మలనే జగత్తు ఆరోపించబడింది.

కాబట్టి పై విషయాల బట్టి ముఖ్యంగా గమనించవలసినదేమంటే మాయ అనే దానికి ప్రత్యేక ఉనికి లేదు. అది మనోభ్రాంతిలోనే ఉంది. ఉన్నది పరబ్రహ్మ అయినప్పటికి తమస్సు వల్ల, అజ్ఞానం వల్ల, మోహం వల్ల, భ్రమ వలన, భ్రాంతి వలన నామరూపాత్మకమైన జగత్తుగా గోచరిస్తోంది. కాబట్టి దాని ఉనికి పరబ్రహ్మ మాత్రమే. అందుచేత తెలుసుకోవలసిందేమంటే మాయ, భ్రాంతి వలన ఆవరిస్తోంది. కాబట్టి భ్రాంతే మాయ. లేనిది ఉన్నట్లుగా గోచరింపచేసి అసంబద్ధంగా చేసిన కర్మ ఫలితాలు అనుభవించటం ఆ భ్రాంతి కారణమే. దీన్నే మాయా కార్యమంటారు. దీనిని దాటాలంటే భ్రాంతిని విడనాడి, విచారణ ద్వారా, శ్రవణం ద్వారా సత్యవస్తు పరోక్ష జ్ఞానం సంపాదించి దానిమీద అచంచల విశ్వాసముతో, సద్గురు బోధ పొంది పురుష యత్నంతో, తీవ్ర ముముక్షత్వంతో నిధి ధ్యాస ద్వారా నిర్వికల్ప సమాధి పొంది, ఆ సత్యవస్తు దర్శనం చేయాలి. అప్పుడు జగత్తుగా గోచరించేది అంతా ఆ పరమాత్మకంటే వేరు కాదు అని అనుభవంలోకి వస్తుంది.

అందుచేత కోరికలు లేకుండా, మోహం లేకుండా, ఇంద్రియలోలుడు కాకుండా, నిత్య నిరంతరం శ్రవణ, మనన, నిధి ధ్యాసలతో పరమాత్మ చింతన చేస్తూ ఉండటం వల్ల మాయా కార్యం నీ మీద విజృంభించదు. కాస్త ఏమరిపాటు తనం రాగానే మాయా కార్యాన్ని విచారణ బలంచే నిర్మూలించాలి. పరమాత్మాభ్యాసతో విచారణా బలమున్న చోట మాయా ప్రవేశముండదు.

మాయ అంత బలవత్తరమైనటువంటిది కాబట్టే **'అఘటిత-ఘటనా పటీయసీ మాయా'** అని శలవిచ్చారు శ్రీ శ్రీ శ్రీ జగద్గురువు శంకరాచార్యుల వారు మాయా పంఞ్చకములో- ఈ మాయనిత్యుడను, నిరుపమడను, నిరంకుశుడును, జ్ఞాన స్వరూపుడును అయినటువంటి పరబ్రహ్మయందు, ఈశ్వరుడు, జీవుడు, జగత్తు అనే భేదము కలుగచేయుచున్నది. మానవులను ఉపనిద్వాక్యములతోనూ, వేద వాక్యములతో సంస్కరించున్ననూ భోగింపదగు ధనాదులను చూపి కలుషితులనొనర్చుచున్నది. గుణవంత భేద రహితుడును, చిత్‌స్వరూపుడును అగు ఆత్మయందు బ్రాహ్మణ వైశ్యుడు కారణములు సృష్టించి నామ రూపాత్మలకు ప్రాధాన్యములు కలిగించి వారిని మోహితులను చేసి జన్మపరంపరలో తోయుచున్నది. ఉదాహరణకు జడ భరతుడనే ఒక ఋషి నదిలో కొట్టుకొని పోతున్న ఒక లేడిని రక్షించి తన ఆశ్రమములో ఉంచుకొని దాని పోషణార్థమై మోహమును పెంచుకొని తిరిగి లేడిగా పునర్జన్మ ఎత్తవలసి వచ్చిందని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. దీనిని బట్టి జ్ఞప్తి యందుంచుకోవలసిందేమంటే మోక్ష సాధనచేయు వారు నిత్య నిరంతరం ఆత్మచింతన చేస్తూ ఆత్మలో నిలకడ కలిగి యుండి తీవ్ర విచారణా బలంతో మాయని గాని మాయా కార్యాన్ని గాని తోసి పుచ్చాలి. ఒక క్షణం ఏమరిపాటు ఉంటే మాయాప్రలోభంతో చ్యుతుడవటానికి సావకాశముంది. తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త జాగ్రత్త.

**పరిశుద్ధాత్మ స్వరూపులారా!** ఇప్పటి వరకు మాయ మాయా కార్యము గురించి చెప్పుకున్నాము. ఇప్పుడు పరబ్రహ్మ స్వరూపము గూర్చి చెప్పుకుందాము. ఆ పరమాత్మ సత్యజ్ఞానానంద స్వరూపుడు, నిత్యుడు, శుద్ధుడు, పూర్ణుడు, అద్వితీయుడు, నిర్వికల్పుడు, త్రిగుణాతీతుడు, సర్వసాక్షి, సర్వాంతర్యామి,

సర్వవ్యాపి, విశోదరుండు, నిరంజనుండు, నిర్వికారుండు, అనంతుండు, స్వయంప్రకాశుడు, కర్మఫలప్రదాత, కూటస్థుడు, నిరాధారుడు. ఇలా అనేక నామాలున్నాయి. ఆ పరమాత్మ ఈ తోలు చక్షువులకు గోచరించడు. అది అనుభవనీయము మాత్రమే. అవాఙ్మన సగోచరుడు. మనస్సు అంతవరకు వెళ్లలేదు. వాక్కు చేత వర్ణింపనలవి కాదు. ఒక లడ్డు తింటేనే తీపిగా ఉంటుంది. ఆ తీపిదనాన్ని ఎలా వర్ణించగలం. అది అనుభవము ద్వారానే తెలుసుకోవాలి. బ్రహ్మము అణువుకాదు. స్థూలము కాదు. పొడుగు కాదు, పొట్టి కాదు, జన్మము, వినాశము, రూపము, గుణము, వర్ణము లేనివాడు, నిష్క్రియుడు- ఆ చైతన్య శక్తి అంటేనే ఆత్మ సర్వే సర్వత్ర వ్యాపించి ఉంది. అదిలేని చోటు లేదు. అది తోలు చక్షులకు కనిపించదు. ఆ శక్తి వలననే సమస్త జగత్తు పని చేయుచున్నది. అది అన్నిటికి ఆధారము, దానికి ఏ ఆధారము లేదు-శాశ్వతము. దాని ఉనికిని తెలుసుకోవటానికి ఒక ఉపాధి అవసరము. ఉదాహరణకి విద్యుచ్ఛక్తి ఉందనుకోండి-విద్యుత్ ప్రవాహము ఉందో లేదో తెలుసుకోవటానికి బల్బు అనే ఉపాధి ఉండాలి. విద్యుచ్ఛక్తి ఆ ఉపాధులకు చైతన్య శక్తి ఇవ్వటము వరకే చేస్తుంది గాని ఆ ఉపాధి ధర్మాల ప్రకారం వాటి వాటి పనులు అవి చేసుకుపోతాయి. అవి చేసే పనులకు విద్యుత్ శక్తికి ఏ విధమయిన ప్రమేయం లేదు. ఆ విద్యుత్ శక్తివలన రేడియో అనే ఉపాధి పలుకుతుంది. బల్బు అనేది వెలిగి కాంతినిస్తుంది. టి.వి. అనే ఉపాధి బొమ్మలను చూపుతుంది. కాలింగు బెల్ అనే ఉపాధి గంట మ్రోగుతుంది. ఇవి ఉపాధి ధర్మాలు. వాటితో విద్యుత్ శక్తికి ఎటువంటి సంబంధము లేదు. అదే విధంగా సూర్యుడు ప్రకాశించి వెలుగునిస్తున్నాడు అందరికి ఎల్ల ప్రదేశాలలో ఆ సూర్యకాంతిలో ఉపాధి ధర్మాలు బట్టి వాసనలు బట్టి వాటి వాటి కర్మానుసారం కొంతమంది చీట్ల పేక ఆడుతారు. కొంతమంది తపఃధ్యానాలు స్వాధ్యాయము చేసుకుంటారు. కొంతమంది చవుక బారు సాహిత్యం చదువుకుంటారు. కాని వారు చేసే కర్మలకు సూర్యునకు ఏ విధమయిన ప్రమేయం లేదు. ఆ సూర్యప్రకాశము కూడా బ్రహ్మ చైతన్యశక్తి వలననే కల్గుచున్నది. ఎందుకంటే బ్రహ్మ సర్వాధారము. అదే విధంగా సకల జీవరాశులలో ప్రత్యగాత్మగా విరాజిల్లుచున్నాడు. ప్రత్యగాత్మ అన్నా, బ్రహ్మ అన్నా, ఆత్మ అన్నా అన్నీ ఒకటే వాటి ధర్మాలు ఒకటే. అది ఎలాగంటే గాడిపొయ్యి

ఉందనుకోండి. అందులో నిప్పు మండుతూ ఉంటుంది. కుంపటిలో నిప్పు కూడా మండుతూ ఉంటుంది. గాడి పొయ్యిలోని అగ్నికి కుంపటిలోని అగ్నికి వాటి ధర్మాలలో ఏమీ తేడా లేదు. కాబట్టి ప్రతి జీవిలోనూ ప్రత్యగాత్మ విరాజిల్లుతూ ఉంటి. ఆ చైతన్య శక్తివలననే అంతఃకరణ పనిచేస్తోంది. దాని ధర్మాలననుసరించి అంటే వాసనలననుసరించి అంటే ఆ జీవి తాను తెచ్చుకున్న వాసనల వలన చేసే కర్మలకు ఆప్రత్యగాత్మకు ఏమీ సంబంధం లేదు. అధి సాక్షిరూపంగా చూస్తు ఉంది. సాక్షికి ఇతరుల వ్యవహారములతో సంబంధము లేదు కదా! అయితే ఇక్కడ జీవాత్మ అంటే ఎవరు అని ప్రశ్న ఉదయించవచ్చు. శ్రద్ధగా వినండి. జీవుడు + ఆత్మ=జీవాత్మ. ఈ ఆత్మ అంతఃకరణ అనే అద్దంలో ప్రతి బింబిస్తుంది. ఆ ప్రతి బింబానికే వేదాంత భాషలో చిదాభాసుడు అంటారు. అంటే చిత్+అభాసుడు=చితాభాసుడు. చిత్ అంటే ఆత్మ యొక్క అభాసుడు-ప్రతిబింబించిన ఆ భాసుడు అంటారు. ఉదాహరణ చెప్పాలంటే సూర్యకాంతిలో ఒక అద్దము పెట్టి ఒక చీకటి గదిలో దాని రిఫ్లక్షను పడేటట్లు తిప్పామనుకోండి. ఆ రిఫ్లక్షన్ సూర్యుడు యొక్క ప్రతి బింబము అవుతుంది. అద్దం అంతఃకరణ అనుకోండి. ఈ ప్రతిబింబము అంటే అద్దము యొక్క రిఫ్లక్షను యొక్క శక్తివల్ల అప్పటివరకు చీకటి గదిలో ఉన్న చీకటి మాయ మయి వెలుతురు కల్గుతుంది. అదే విధంగా ప్రత్యగాత్మ అంటే ఆ చైతన్య శక్తి యొక్క ప్రతిబింబవే అంతఃకరణలోని చిదాభాసుడు అనే పేరుతో వ్యవహరింప బడుతున్నాడు. ఈ చిదా భాసుని శక్తివల్ల అంతఃకరణ అంటే బుద్ధి మనస్సు, ఈ జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ప్రేరేపింపబడి తాను తెచ్చుకున్న వాసనారూపమైన కర్మలాచరిస్తున్నాయి. ఈ చిదాభాసుడు అంతఃకరణలో అంటే, బుద్ధి మనస్సు, కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలతో వాటి ధర్మాలన్ని అహం కరించి తన మీద వేసుకుంటున్నాడు. కాబట్టి తేలిన సారాంశమేమంటే చిదాభానుడు+కోర్కెలతో కూడిన అంతఃకరణ ప్రవృత్తులు కూడి జీవుడు అనబడుతున్నాడు. అట్టి జీవుడు శరీరానికి కష్ట సుఖాలు కల్గితే తనకి కలగాయని, మనస్సు క్షోభిస్తే తాను క్షోభిస్తు సకల కర్మలను అంటే దుష్కర్మలకు సత్కర్మలకు కర్తృత్వ భావముంచి ప్రారబ్దంతీరగానే అంతఃకరణతో ఆకర్మ ఫలితాలను మోసుకుంటూ ఆ కర్మఫలితాలు అనుభవించటానికి ఇంకొక శరీరము

తీసుకుంటున్నాడు.

సృష్టికి పూర్వం ఉన్న శుద్ధచైతన్యం, మూలప్రకృతి అనే శుద్ధ సత్వ ప్రధానమైన మాయలో ప్రతిబింబించి ఈశ్వరుడని చెప్పబడుతున్నాడు. ఈ ఈశ్వరుడికే అవ్యాకృతుడనిన్నీ, అంతర్యామి అనిన్నీ ఎన్నో పేర్లు ఉన్నాయి. ఇతడే పరిపూర్ణ పరబ్రహ్మ. ఈ ప్రకృతికే మాయ అని, అవిద్య అని, తమస్సు అని, మోహమని, అజ్ఞానమని అనేక పేర్లు ఉన్నాయి. ఈ ఈశ్వరుడే సత్త్వ రజస్తమో గుణాలనే ఉపాధులతో బ్రహ్మ, విష్ణు, రుద్రరూపుడై సృష్టి స్థితి సంహారాలు చేస్తాడు. ఈశ్వరుడు బ్రహ్మకంటే వేరుకాడు. అందుచేత ఈశ్వరుడే ప్రథమ జీవి అగుచున్నాడు.

ముఖ్యంగా గమనించవలసింది ఏమంటే ఈశ్వరుడు, జీవుడు కూడా బ్రహ్మ చైతన్యం యొక్క ప్రతి బింబాలే కాని వేరు కాదు. అద్దంలో ప్రతి ఫలించిన ప్రతిబింబం బింబం కంటే వేరు కాదు కదా! అద్దంతీసి వేస్తే ఆ ప్రతి బింబం బింబం లోనే లయమవుతుంది. ఇందులో ఏ విధమయిన అనుమానానికి ఆస్కారములేదు. కాబట్టి ఈశ్వరుడు జీవుడు కూడా ప్రతిబింబ స్వరూపులే, బింబంకంటే వేరు కాదు. జీవుని అంతఃకరణ మలినమైనది కాబట్టి. దానిలో ప్రజ్వలించిన ప్రతిబింబానికి అంటే జీవుడు అల్పజ్ఞుడు అవుతాడు. అల్పశక్తిమంతుడు. అందుచేత అంతఃకరణ ఎంత ఎంత శుద్ధి చేసుకుంటాడో అంత అంత శక్తివంతుడవుతాడు. కాబట్టి మన ప్రయత్నమంతా అంతఃకరణ శుద్ధి చేసుకొని ప్రత్యగాత్మలో నిలకడ కల్గి ఉండాలి.

ఈ జీవుడు కూడా పరమాత్మ అంశీభూతుడే కాబట్టి పరమాత్మ ధర్మాలన్నీ జీవునకు కూడా ఉన్నాయి. కాని అంతఃకరణతో ఏకీభవించి భ్రాంతి వలన, అజ్ఞానం వలన తాను వేరు పరమాత్మ వేరు అని భ్రాంతి చెంది వ్యవహరిస్తాడు. తానంటే దేహమని, దేహాభిమానంతో ఆదేహ సంబంధీకుల మీద మోహంతో కర్తృత్వ భావనతో కర్మలు చేస్తూ ఆ కర్మ ఫలితాలను అనుభవించటానికి జనన మరణాలు తనకు కలుగుతున్నాయని రోదిస్తున్నాడు. ఇపుడు చేయవలసిందల్లా ఆభ్రాంతి

వదలడమే. జ్ఞానం చేత అజ్ఞానం రూపుమాపుకొని విజ్ఞాన సముపార్జన చేసుకోవటమే. అపుడు నీవే ఆత్మవై పోతావు. అసలు నీవు ఆచిదాత్మవే. జీవుడు కూడా సనాతనుడు. సత్ చిత్ ఆనంద స్వరూపుడు-సాక్షి-నిత్యుడు. కాబట్టి శివుడే జీవుడు. జీవుడే శివుడు. ఈ ఏకత్త్వాన్ని ఎవరు గుర్తిస్తారో వారే పరిపూర్ణజ్ఞానులు. అంటే తత్త్వమసి మహావాక్యార్థమే అవుతుంది. **'జీవో బ్రహ్మైవనా పరః**

ఇపుడు శరీరము ఎలా ఏర్పడింది. అంతఃకరణ అంటే ఏమిటి-పంచకోశ వివరణ-శరీరత్రయ వివరణ విశదీకరిస్తాను-ఈ శరీరములో 'నేను' 'నేను' సంబోధించేది ఎవర్ని ఉద్దేశించినది. మొదలయిన అంశములు వివరిస్తే సాధనకు ఉపకరిస్తుంది.

**పరమానంద స్వరూపులారా!** ఈ శరీర పాంచభౌతికము. అంటే పంచ భూతాల కలయిక వల్ల ఏర్పడింది. పంచ భూతాలంటే (i) పృధివి (ii) జలం (iii) తేజము (iv) వాయువు (v) ఆకాశము. పంచ మహా భూతాల పంచీకరణ ద్వారా ఏర్పడింది. పంచీకరణ అంటే నిర్దిష్టమయిన పాళ్లలో ఆ పంచభూతాల కలయిక. అపంచీకరణ విధానము, ఆ పాళ్లు మనకి అప్రస్తుతము. ఆ గందర గోళంలో మనం వెళ్లి మన మేధస్సును పాడు చేసుకోవద్దు. పంచ భూతాల కలయికవల్ల పంచీకరణ ద్వారా దేహమేర్పడింది. దేహమే సంసార వృక్షానికిగట్టి మూలం. భార్య బంధువులు దేహానికి మూలం ఇది స్త్రీ పురుష శుక్ర శ్రోణితముల కలయిక వల్ల ఏర్పడుతుంది. స్త్రీ గర్భంలో నవ మాసాలలో కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు ఏర్పడి, స్త్రీ తీసుకొను ఆహారం వలన సుషుమ్నానాడి గుండా గర్భస్థలములో నున్న శిశువుకు ఆహారం అందింపబడటంవల్ల వృద్ధి చెందుతుంది. ఇదంతా గర్భోపనిషత్‌లో చెప్పబడింది. ఆ శరీరములో జీవుడు పూర్వ కర్మ ఫలితాలను అనుభవించటానికి ఒక శరీరము కావాలి కాబట్టి ఆ శరీరములో గర్భస్థంలో ఉండగానే ప్రవేశిస్తాడు. ప్రత్యగాత్మ జీవుడు కర్మ ఫలితాలతో సహా నిర్దిష్ట మాసములో ఆ శరీరంలో బ్రహ్మ రంధ్రాలలోని సుషుమ్నానాడి ద్వారా ప్రవేశిస్తాడు. మాతృ గర్భమందు తొమ్మిదవ మాసము పూర్తవగానే జీవునకు తాను చేసుకున్న పూర్వ కర్మలు, పాప పుణ్యములు ఎత్తిన జన్మలు స్మరణకు వచ్చి ఈ క్రింది విధముగా స్మరణ చేయును.

'నేను లెక్కలేనన్ని యోనిలలో జన్మలనెత్తి, ఎన్నియో సార్లు చచ్చితిని, పుట్టుట, చచ్చుట అనే చక్ర భ్రమణలో తిరిగి తిరిగి వేసారితిని. ఈ గర్భవాసము మహా దుఃఖమైనది. విషయాసక్తితో దుష్కర్మల నాచరించి జ్ఞాన సాధనవములు చేయకుండా కామక్రోధాలు పెంచుకుంటిని. ఈ మాతృ గర్భమునుండి బయట పడగానే అనన్య భక్తిని ఆ పరమేశ్వరుని యందు లగ్నము చేసి, సద్గురువు నాశ్రయించి పునర్జన్మలేని మోక్ష సాధనకు తీవ్ర ప్రయత్నము చేయుదును. అని ఈ విధముగా పశ్చాత్తాపముతో పరితపించు చుండును. అపుడు యోని ద్వారమునుండి విడుదల పొందుటకు ప్రయత్నించి అశక్తుడై యంత్రమునందు తగుల్కొనినట్లు బాధపడుచున్నాడు. వైష్ణవ వాయువుచే వ్యాపింపబడి ఆ ప్రసవ కష్టములో దైవ సాధనలేక జన్మించుచున్నాడు. పృధివీ స్పర్శ అయినవెంటనే పూర్వ దృష్టి కోల్పోయి పూర్వ జన్మలలోని బీజ రూపములలోనున్న వాసనలతో కూడి యుండును. అవిద్యకు లోనగును. (గర్భోపనిషత్తు మం. 25)

ఈ శరీరము ముఖ్యంగా 19 తత్వాలతో కూడుకొని ఉన్నది. కొంతమంది ఇంకాకొన్ని ఎక్కువ తత్త్వాలు ఉన్నాయంటారు. మనము ముఖ్యంగా 19 తత్త్వాలు తెలుసుకుంటేచాలు మన సాధనకి.

| | |
|---|---|
| కర్మేంద్రియాలు అంటే ఏ అంగాలలో అయితే కర్మలు చేస్తామో అంటే అవి కళ్లు, చేతులు, ఉపస్థ మొదలైనవి. | 5 |
| జ్ఞానేంద్రియాలు అంటే విషయ పరిజ్ఞానం కలుగచేసేవి అంటే కళ్లు, నాలుక, ముక్కు, చెవి, స్పర్శ | 5 |
| పంచ ప్రణాలు- అంటే ప్రాణ, ఉపాన, వ్యాన ఉదాన, సమాన అనబడునవి | 5 |
| అంతఃకరణ చతుష్టయములు మనసుకు బుద్ధి, చిత్తము అహంకారం | 4 |
| | 19 |

ప్రత్యగాత్మ పంచకోశాలతో కప్పబడింది. ఇది ఎలాగ అంటే కత్తి ఒరలో కత్తి ఉండినట్లు. అవి అన్నమయ కోశమని, ప్రాణమయకోశమని, మనోమయ కోశమని, విజ్ఞానమయ కోశమని, ఆనందమయ కోశమని పేర్లు. ఈ పంచకోశాలు, పంచకోశ ధర్మాలు అనాత్మలు. అవి ఆత్మ కాదు. ఆత్మ అంటే 'నేను' 'నేను' అని ఎల్లవేళల సంభోదించుకునేది. 'నేను' ఎల్లవేళల ఉన్నాను అదే ఆత్మ- అది శాశ్వతము. అది చచ్చేది కాదు జన్మించేది కాదు. అది అన్ని అవస్థలకు సాక్షి. అందుచేత ఈ కోశ ధర్మాలు, నేను కాదు నేను కాదు 'నేతి' 'నేతి' అని త్రోసి పుచ్చుతూ, ధ్యానం ద్వారా విచారణ ద్వారా లోనికి చొచ్చుకుని పోతే బుద్ధి గుహలోనున్న ఆ 'నేను 'ని' అంటే ఆత్మను అనుభవించవచ్చును. కాబట్టి ఈ పంచకోశ విచారణ ఏ విధంగా చెయ్యాలి. కోశాంతర్గ ఆత్మ వరకు ఏ విధంగా చేరాలి అని వివరిస్తున్నాను.

**(i) అన్నమయ కోశము :** ఈ పంచ కర్మేంద్రియాలతోనున్న స్థూల శరీరము అన్నమయ కోశము అంటారు. ఇది స్వతహా జడ పదార్థము. షడ్భావ వికారములు గలది. ఇది తల్లి తండ్రుల చేత భుజింపబడిన అన్నము ( ఆహారము) చేత పుట్టి, పెరుగుచూ అన్నవికారమై ఉంది. ఇది పాంచ భౌతికము. ఇది పుట్టుటకు పూర్వము లేదు. నశించిన తరువాత ఉండదు. దేహము జడము అందలి అమృతత్త్వము చేతనము. ఈ రెంటి కలయికయే దేహమును నడిపించుచున్నది. ఏ చైతన్యం జాగ్రదావస్థలోనూ, స్వప్నావస్థలోనూ సుషుప్తావస్థలోనూ ఏకాకారముగ ఉండి అవస్థాత్రయమునకు సాక్షిగా ఉన్నదో అదే అమృతత్త్వము. మాయా వశమున దేహాత్మ భావం కలుగుటయే మృత్యువు. మృత్యువు సమీపించుననుకొను వారెన్నటికిని మృత్యుంజయులు కాలేరు.

ఏకాకారముగ సాక్షిగ యున్న చైతన్యమును జాగ్రదావస్థకు స్వప్నావస్థకు మధ్యగల సంధిగ్ధ సమయంలోనే తెలియనగును. ఆత్మ శాశ్వతము. ఆత్మకు జన్మమరణములు లేవు. ఆత్మ చైతన్య శక్తి వలననే అంటే ఈ శరీరములో 'నేను' అనే ఉనికివలనే అన్నమయ కోశము పని చేయుచున్నది. 'నేను' నిష్క్రమిస్తే శరీరము జడము కాబట్టి చైతన్య రహితంగా పడిపోతుంది. చలన స్థితి ఉండదు. అందుచేత ఈ శరీరానికి నేను సాక్షిని మాత్రమే. ఒక గృహంలో ఉంటుంటే నేను గృహమును

ఎటుల కానో గృహమునకు విలక్షుడనో అదే విధముగా ఈ శరీరము నేను కాదు. ఒక చెయ్యి పోయినా, కాలు పోయినా లేదా ఏ అంగము పోయినా నేనుంటున్నాను శరీరంలో. అందుచేత 'నేను' అంటే ఆత్మ ఈ స్థూల శరీరముకాదు. కాని అన్యోన్యా ధ్యాసచే అజ్ఞానముచే దేహ ధర్మములు ఆత్మయందు ఆరోపించుకొని దేహము పోవుచుండగా నేను పోవుచున్నానని భ్రమ చెందుతున్నాడు. 'నేను'కి ఎప్పుడు చావు లేదు. **'అజో నిత్యో శాశ్వతోయం'** అని భగవద్గీతలో చెప్పినటుల ఆత్మ ఎప్పుడు ఉండేవాడు. అతడు నిత్యశుద్ధభుక్తముక్త స్వభావుడు, నిరంజనుడు, నిష్క్రియుడు, నిత్యుడు, నిర్వికారుడు, అవ్యయుడని తెలుసుకొనుటచే 'నేను' శరీరము కాదని దానికి సాక్షి మాత్రమేనని గ్రహించవలెను. పైగా కులము, గోత్రము, రంగు, రూపము, పొట్టి, పొడుగు ఇవన్నీ శరీరానికే గాని ఆత్మకు లేదు. ఈ విధముగా తీవ్ర విచారణ, ధ్యానము ద్వారా అన్నమయ కోశ ధర్మాలని వాటిని త్యజించి ఆ కోశమును దాటాలి.

**(ii) ప్రాణమయ కోశము :** దీని ప్రధానాంగాలు పంచ ప్రాణాలు. ఇవి శరీరమంతా ఆపాద మస్తకము వ్యాపించి వ్యాసరూపమున శరీరమునకు బలమునిస్తూ సకలేంద్రియములను ప్రేరేపిస్తూ చలన రూపమయింది. ఆకలి దప్పికలు ప్రాణమయకోశ ధర్మములు. ఈ ప్రాణమయ కోశ ధర్మములు "నేను" యందు ఆత్మ ధ్యాసచే నేను ఆకలి దప్పికలు గలవాడను, శక్తి హీనుడను, వక్తను, దాతను, మూగను అను ధర్మములు తనయందు ఆరోపించుకొనుచున్నాడు. ఇది ఘట పటాదులవలె ఆత్మ కాదు. నా ప్రాణము బాగాలేదు అని అంటుంటాము కదా! అంటే 'నేను' వేరు ప్రాణము వేరు అని కదా అంటున్నది. అందుచేత ప్రాణమయ కోశము కూడా నేను కాదు. దానికి కూడా సాక్షిగా చూస్తున్నాను. పైగా ఈ కోశముకు 'నేను' యొక్క సాన్నిధ్యము చేత, చైతన్య శక్తి చేత పనిచేయుచున్నది. నేను నిష్క్రమిస్తే ప్రాణాలు కూడా నిష్క్రమించగా శరీరము జడమయి పడిపోతుంది. కాబట్టి కొలిమి యందు తిత్తివలె ప్రాణమయ కోశము జడము. ఈ విధంగా తీవ్ర విచారణ శక్తిచే ధ్యానం ద్వారా ప్రాణమయ కోశం ఇది 'నేను' కాదు ఆత్మకాదు అని విసర్జించి ఆ కోశాన్ని కూడా దాటాలి.

**(iii) మనోమయ కోశము:** మనస్సు పంచజ్ఞానేంద్రియాలు ( అంటే కళ్లు,

చెవి ముక్కు, నాలుక, స్పర్శ) దీని ప్రధానాంగాలు. సంకల్ప వికల్పాలు ఈ కోశ ధర్మాలు. చలన స్వభావము కలది. కామ క్రోధ, మోహ మదమాత్సర్యాలు, సుఖ దుఃఖ సంకల్పాలు కలుగ చేసేది ఈ కోశమే. ఈ కోశము బంధ మోక్షాలకు కారణ మవుతుంది. మనస్సు ప్రధానమైన అంగము. ఇది ఇంద్రియాలతో బహిర్ముఖమై విషయ జ్ఞానం కలుగచేసి కోర్కెలు పెంచి, ఆ కోర్కెలు ఫలించకపోతే రాగ ద్వేషాలు పెంచి జీవుని అధోగతి పాలు చేస్తుంది. చెడ్డ మనస్సు ముముక్షువుకు శత్రువు. ఇంద్రియాల ద్వారా బహిర్ముఖమై విషయ పరిజ్ఞానము గ్రహించటం మూలంగా జీవుడు మనస్సుతో ఏకీభవించి ఇంద్రియలోలుడై పతన మవుతున్నాడు. జనన మరణ సంసారంలో పడవేసేది ఈ మనస్సే. అటువంటి మనస్సు ముముక్షువుకు శత్రువు. అందుకే బుద్ధితో విచారణ చేసి మనస్సును అదుపులో పెట్టుకొని, ఇంద్రియాల ద్వారా గ్రహించిన విషయ పరిజ్ఞానము జోలికి పోక, నిగ్రహించి తాను ఆత్మలో నిలకడ కల్గి ఉంటే ఆ మనస్సే శుద్ధమనస్సు అయి జీవుని మోక్షసాధనకు సహాయమొనరిస్తుంది. అందుచేత ఈ మనో మయ కోశములోని మనస్సుతో ఏకీభవించక తాను విలక్షుణుడుగా ఉంటూ ఆ మనస్సుకు కూడా సాక్షి రూపంలో ఉంటూ దాని ఆలోచనలను సంకల్పాలను నిర్మూలించటానికి ప్రయత్నించాలి. ముఖ్యంగా గమనించవలసినదేమంటే మనోమయ కోశము కూడా 'నేను' కాదు. నా మనస్సు బాగుండలేదంటాడు. అంటే తాను వేరు మనస్సు వేరు అని దృఢమవుతోంది కదా! అందుచేత నేను మనస్సు కాదు, ఇంద్రియాలు కాదు 'నేను' ఆత్మ స్వరూపుడను అని నిర్ణయం చేసుకుంటూ తీవ్ర విచారణ, ధ్యానం ద్వారా మనోమయ కోశాన్ని వదలి తరువాత కోశమయిన విజ్ఞానమయ కోశంలోకి చొచ్చుకొని పోవాలి. గాఢ సుషుప్తిలో ఈ మనస్సు దాని కర్మ లేదుకదా-సుషుప్తిలో నాలోనే లయమయింది. జాగ్రదావస్థలోకి రాగానే నాలో నుండి వెలుపలకు వచ్చి నా చైతన్య శక్తితోనే పని చేయనారంభిస్తోంది. కాబట్టి నేను వేరు మనస్సు వేరు అని తెలుస్తోంది. నేను అంటే మనస్సు కాదు ఆత్మను అని విడమర్చుకొని ఈ మనోమయ కోశాన్ని దాటి పోవాలి. ఈ మనో మయ కోశం వరకు వచ్చి ఆ మనోకార్యాలలో చిక్కుకొని చాలా శ్రమ పడతారు చాలా మంది ముముక్షువులు. ఈ కోశాన్ని దాటగలిగితే మార్గము సుగమమవుతుంది. దీనికి తీవ్ర వైరాగ్యము, సంకల్ప త్యాగము,

తత్పరత మొదలయిన సాధనాలు చాలా అవసరము.

**(iv) విజ్ఞాన మయ కోశము:** బుద్ధి, పంచజ్ఞానేంద్రియాలు దీని ప్రధానాంగములు. కర్తృత్వ నిశ్చయాత్మక శక్తి కలది బుద్ధి. ఇక్కడ ముఖ్య విషయము గుర్తించాలి. మానవుని అంతఃకరణలో ముఖ్యంగా మనస్సు అని, బుద్ధి అని, చిత్తమని, అహంకారమని నాల్గు అంగాలున్నాయని అంటారు. మనస్సు గురించి మనోమయ కోశంలో ఇంతకముందే చెప్పాను. నిజం చెప్పాలంటే ఈ నామాలన్నీ మనస్సుకే పర్యాయ పదాలు. ఆ మనస్సు చేసే పనిని బట్టి దానికి ఆ పేరు వస్తుంది. ఒక ఉదాహరణ. ఒకడు బజారుకెళ్లాడు. దూరం నుంచి అంగడిలో పచ్చగా ఉన్న పళ్లను చూచి మామిడి పళ్లు అనుకున్నాడు. ఈ విషయ పరిజ్ఞానం ఇంద్రియాల వల్ల కల్గింది. మనస్సు బహిర్ముఖమయింది కాబట్టి, పచ్చనివి చూడగానే ఆ విషయాలు ఆకారము రంగు మొదలైనవన్నీ తన మనస్సుతో నిక్షిప్తమై ఉన్న విషయ పరిజ్ఞానము పైకి వచ్చింది. అంటే చిత్తములో అనేక రకాలయిన విషయ పరిజ్ఞానములు దాని వాసనలు బీజ రూపంలో నిగూఢమయి ఉంటాయి. అంటే ఈ చిత్తము ఆఫీసులోని రికార్డు రూము వంటిది. ఈ మనస్సు మామిడి పళ్లని చూసి వాటి ధర కొంటే ఉండే లాభ నష్టాలు ఆలోచిస్తుంది ఇంద్రియాల తృప్తికై. అంటే ఈ స్టేజిలో ఈ మనస్సు ఆఫీసులో ఒక గుమాస్తాలాంటి.పని చేసి నివే దిస్తుంది. అప్పుడు బుద్ధి ఆ విషయాలను పరిగణనలోనికి తీసుకొని ఉన్న డబ్బుబట్టి పళ్లని కొనాలి అని నిశ్చయిస్తుంది. అందుకే బుద్ధి నిశ్చయాత్మక తత్వం గలది అంటారు. బుద్ధి నిశ్చయం చేయగానే, అహం అంటే 'నేను' ఆకారం ధరించి, అహంకారంతో కర్మేంద్రియాలతో మామిడి పళ్లు అనే క్రియ సమాప్తి చేస్తాను. ఇక్కడ చేస్తున్న నేను అసలు 'నేను'కాదు. ఈ శరీరంలో రెండు 'నేను'లున్నాయి. ఒక్కటి అసలు 'నేను' ఈ నేనునే 'అహం' అంటారు. అంటే ఆత్మ. ఇది సంకల్పాలు చేయదు. నిష్క్రియుడు నిరంజనుడు, త్రిగుణాతీతుడు. సర్వసాక్షి-సర్వవ్యాపి- దాన్నే బింబం అంటారు- దాని ప్రతిబింబమయిన చిదాభాసుడు బుద్ధితోనూ మనస్సుతోను శరీరంతోనూ ఏకీభవించి, వాటి ధర్మాలు తాదాప్యములో తన మీద వేసుకొని అసలు ఉన్న 'అహం'కు ఆకారము సృష్టించుకొని నేను మామిడి పళ్లను

కొన్నాను అనే కార్యాన్ని పూర్తి చేస్తుంది. కాబట్టి ముఖ్యంగా గ్రహించవలసిందేమంటే, ఈ అహంకారంగాని, బుద్ధి కాని, మనస్సుకాని, చిత్తం కాని ఇంద్రియాలు కాని సుషుప్తిలో అంటే అసలు 'నేను'లో 'అహం'లో లయమవుతాయి. కాబట్టి నేను విజ్ఞానమయ కోశానికి, దాని ప్రధానాంగమయిన బుద్ధికి కూడా సాక్షిగా ఉన్నాను. అప్పుడప్పుడు మనమంటుంటాం 'నా బుద్ధి ఈ రోజు సరిగా పని చెయ్యలేదు- అందుచేతనే ఈ పని ఈవిధంగా ఫలితాన్నిచ్చింది అని. కాబట్టి నేను వేరు బుద్ధి వేరు అనే కదా! కాబట్టి బుద్ధి నేను కాదు. అంటే విజ్ఞానమయ కోశం వాటి ధర్మాలు నేనుకాను. అవి ఆత్మకావు. విజ్ఞానమయ కోశం కూడా నా సాన్నిధ్యం చేత చైతన్య వంతమయి పని చేస్తున్నాయి అని విచారణా బలంతో తీవ్ర ధ్యానము ద్వారా తోసిపుచ్చి ముందుకు సాగి పోవాలి.

**(iii) ఆనందమయ కోశం:** ఆనంద స్వరూపమయిన బింబము ( ఆత్మ) ఈ ఆనందమయ కోశము. ఈ ఆనందమయ కోశము బుధ్యాదుల యందు ప్రతిబింబ భావముచే వర్తించుచుండును. ఈ కోశము పుణ్య భోగకాలమందు వ్యక్తమై అది క్షీణింపగానే సుషుప్తిలో లయమొందును. ప్రియము, మోదము, ప్రమోదము అనెడి సుఖ వృత్తులచే తెలియబడుచున్నది. అజ్ఞానము, అభిలాష, అహంకారము, భోక్తృత్వాది వికారములు కలిగి అజ్ఞానిని భ్రాంతి గలవానిని సుఖిని అను తామస వృత్తులు కలది, ఆనందమయ కోశము. బింబ స్వరూపుడయిన ఆత్మ దేవుడు బుద్యాదులున్న ఈ ఆనందమయ కోశములో ప్రతిబింబ రూపుడయి చిదాభాసుడనబడుచున్నాడు. కాబట్టి పై పంచకోశములు 'నేతి' 'నేతి' నేను ఇదికాదు అని త్రోసిపుచ్చుచు బింబ రూపుడయిన సత్‌చిత్ ఆనందమందు, సర్వకాల సర్వావస్థలయందు నిత్యశుద్ధ బుద్ధముక్త నిష్కళంక, నిష్క్రియ నిర్గుణ, నిరాకార, పరిపూర్ణ చైతన్యమందు ఈ కోశాలన్ని లయమయి అఖిలానంద మవుతాయి. ఇది నేను కాదు ఇది నేను కాదు- 'నేతి' 'నేతి' అని త్రోసి వేస్తూ, తీవ్ర సాధనతో పోగా పోగా ఏమి మిగిలి ఉందో అది తానే- అదే ఆత్మ- సాక్షి- ఎరుక- స్వయం ప్రకాశము- స్వస్వరూపము ఇది ఎల్లప్పుడు ఉండునదే- నశించేది కాదు- పుట్టేదికాదు- 'నేను' 'నేను' అని సంబోధించేది అదే అంటే నువ్వు ఆత్మవు. ఇది సాధన ద్వారా తీవ్ర

విచారణ ద్వారా ఆ 'నేను'ను స్వస్వరూపమును అనుభవించుటమే జీవిత పరమావధి.

ఈ పంచకోశ సముదాయాన్ని వేదాంత భాషలో పూర్తిగా అర్థమవటానికి మూడు శరీర భాగాలుగా విభజించారు. అంటే (i) స్థూల శరీరము (ii) సూక్ష్మ శరీరము లేక లింగ శరీరము (iii) కారణ శరీరము అని. 'నేను' 'నేను' అనబడే ఆత్మ ఈ మూడు శరీరములకు విలక్షణంగా ఉంది. **(i) స్థూల శరీరమంటే** మనకి కనిపించే పంచభూతాత్మకమైన స్థూల శరీరము కర్మేంద్రియాలు కలది. ఈ శరీరము నేను కాదు. దానికి సాక్షిగా ఉన్నాను. అది నా చైతన్య శక్తి వలనే పని చేస్తోంది. నేను నిష్క్రమిస్తే అది జడ పదార్థము కాబట్టి చైతన్య రహితంగా పడి పోతుంది. ఇది జాగ్రదావస్థలో పనిచేస్తోంది. అంటే పంచ కోశాలు నా సాన్నిధ్య చైతన్య శక్తి చేత పని చేస్తోంది. ఆ జాగ్రదావస్థలో జరుగు కార్యకలాపాలకు కూడా నేను సాక్షిని.

**(ii) సూక్ష్మ శరీరం లేక లింగ శరీరము.** ఇదీ కర్మేంద్రియాలు, పంచ ప్రాణాలు, జ్ఞానేంద్రియాలు మనస్సు చిత్తము, బుద్ధి అహంకారము అంగాలుగా కలది. ఇది స్వప్నావస్థలో జరిగే కార్యకలాపాలకు ఆటపట్టు. ఇక్కడ ప్రాణమయ కోశం, మనోమయ కోశం, విజ్ఞాన మయ కోశం పని చేస్తున్నాయి. అన్నమయ కోశం అంటే స్థూల శరీరం అచేతనంగా పడి ఉంది. మిగిలిన కోశాలు పని చేస్తున్నాయి. జాగ్రదావస్థలో జరిగిన కార్యకలాపాలు ఆ ప్రపంచము ఇక్కడ ఉండదు. అది స్వప్నావస్థలోకి పోగానే ఆ జాగ్రదావస్థలోని జగత్తు మాయ మవుతుంది. ఉదాహరణకు చెప్పాలంటే అప్పుడు కడుపునిండా భోజనం చేసి పడుకున్నావు. నిద్రలోకి జారి స్వప్నం కన్నావు. ఆ స్వప్నంలో నీకు అమితమయిన ఆకలి అయింది. ఇంటిలో భార్యలేదు. నీవే లేచి అన్నం పెట్టుకొని తింటున్నావు. ఆ అన్నంలో విషం కలిపి ఉండటం చేత అది కూడా తిని చచ్చిపోయావు. బంధువులందరూ నీ చుట్టూ చేరి రోదిస్తున్నారు. నీ శవాన్ని నీవు ఇతరులు కూడా మోసుకొని పోతున్నారు. ఈ లోగా మెళుకువ వచ్చింది. ఈ స్వప్న జగత్తు జాగ్రదావస్థలో లేదు. స్వప్నంలో నీవు చూసిన జగత్తు నీ అనుభవాలు అప్పుడు నీకు అది సత్యమే కదా! అయితే అస్వప్నావస్థకు కూడా 'నేను' అంటే 'ఆత్మ' సాక్షిగా ఉండి చూడటం చేత స్వప్నావస్థ

నుండి జాగ్రదావస్థలోకి రాగానే ఆ అనుభవాలన్ని చెప్పగలుగుతున్నావు.

**(iii) కారణ శరీరము :** ఇది సుషుప్తిలో జరుగు కార్యము. స్వప్నావస్థలో నుండి గాఢ సుషుప్తిలోకి పోయావు. అక్కడ స్థూల శరీరము కాని, లింగ శరీరము కాని పని చెయ్యటం లేదు. అచేతనంగా పడి ఉన్నాయి కాని పంచ ప్రాణాలు శరీర సంరక్షణార్థమై పని చేస్తున్నాయి. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు మనసులో లయమయి, మనస్సు బుద్ధిలోనూ, ఆ బుద్ధి ప్రతిబింబంతో సహా నాలో అంటే 'ఆత్మలో లయ మంయినాయి. అప్పుడు మనస్సులేదు. మనోకార్యములేదు. అందుచేతనే నీవు గాఢంగా నిద్రపోయినపుడు అంటే సుషుప్తిలోకి పోయినపుడు నీమీద ఒక పాము ప్రాకుతున్నా నీకేమి తెలియదు. భయ కంపాదులు లేవు. ఆ స్థితిలో అఖండానందము అనుభవిస్తున్నావు. ఆ స్థితి రాజు అయినా, బీదవాడయినా, ధనవంతుడయినా అందరికీ సమానమే. వారు అనుభవించే ఆనందములో ఏమీ భేదం లేదు. గాఢ నిద్రనుండి బయటకు రాగానే నేను హాయిగా నిద్ర పోయాను ఆనందంగా అంటున్నావు. అంటే దీని అర్థం ఏమిటి! ఆ ఆనందాన్ని అనుభవించిన స్థితిని నీవు జాగ్రదవస్థకు రాగానే సాక్షి రూపకంగా ఉంటూ అనుభవించినది తెలుపుచున్నావు. కాని సుషుప్తిలో అనుభవించిన స్థితి సమాధి అనిపించుకోదు. అజ్ఞానము అనే కారణ శరీరము ఉంది కాబట్టి తమో గుణ రూపమయినది. అంతేగాని సమాధి కాదు. ఈ సమాధి అనే స్థితి జాగ్రదావస్థలో ఉండగా, విచారణాబలంతో తీవ్ర ధ్యానంతో స్థూల శరీరాన్ని, సూక్ష్మ శరీరాన్ని కారణ శరీరాన్ని తొసిపుచ్చి- 'నేను' 'నేను' అనబడే ఆత్మలో అంటే స్వస్వరూపములో మునక వేస్తే అది నిర్వికల్ప సమాధి అవుతుంది. ఆ స్థితినే తురీయాతీతం అంటారు. ఆ స్థితిని చేరుటే జీవితం పరమావధి. అప్పుడే దుఃఖ నివృత్తి అఖండానందం కలుగుతాయి. ఆ స్థితి ఒక్క క్షణం అనుభవించినా సంచిత కర్మ ఫలాలు నశించి పోతాయి. ఆగామి కర్మ ఫలాలు అంటుకోవు. ప్రారబ్ధము శరీరానికి వదిలి సాక్షిగా ఉంటాడు. మానవుడై పుట్టినందుకు ఈ స్థితిని సంపాదించి సర్వకర్మ బంధములనుండి విడివడి మోక్షార్హత పొందటమే ధ్యేయమై ఉండాలి. ఆ స్థితిని అనుభవించి విజ్ఞానమును సంపాదించినవాడు జ్ఞాని అనిపించుకోబడుతాడు. ఇక

చేయవలసిన కర్మలుండవు. ఇక తెలుసుకోవలసిన దేమీ ఉండదు. ఇదే పరమవిద్య. అటువంటి వాడే మత్యుంజయుడనబడుతాడు. ఇంతవరకూ చెప్పినదంతా మనలో ఇంకా **'అహం బ్రహ్మాస్మి'** అనే మహా వాక్యాన్ని తీసుకొని కొన్ని వాసనా ప్రతిబంధకాల వల్ల నిర్వికల్ప సమాధి చేరనటువంటి వారికి బ్రహ్మ విద్య నేర్చుకున్నది దృఢపడుటకు, ఇంకా మహావాక్యోపదేశము పొందని వారికి తన స్వస్వరూపము ఎటువంటిది, భగవత్సరూపము ఏది? ఏ విధంగా ఆధ్యాత్మిక సాధన చెయ్యాలి అనే బోధ కొరకు చెప్పబడింది. మిగిలిన విషయములు రేపు మాట్లాడుకుందాము.

దుర్జనస్సజ్జనోభూయాత్, సజ్జనశ్శాన్తి మాప్నుయాత్

శాన్తోముచ్యేత బన్ధేభ్యో ముక్తశ్చాన్యాన్విమోచయేత్ ||

ఓం అసతో మా సద్గమయ | ఓం తమసోమా జ్యోతిర్గమయ |

ఓం మృత్యోర్మా అమృతం గమయ ||

ఓం సహనా వవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై ||

**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

# మూడవ రోజు ఉపన్యాసము

**ప్రేమ స్వరూపులారా!** నిన్న మనం చెప్పుకున్న సారాంశమేమంటే

(i) నేను అంటే ఆత్మని-శరీరాన్ని కాదు, జ్ఞానేంద్రియాలు కాదు, మనస్సు బుద్ధి కాదు. ఆకారము కల్పించుకొని అహంకారముతో వ్యవహరించే నేను కాదు-నేను వీటన్నిటికి సాక్షిని-కూటస్థుడను-ఆనంద స్వరూపుడను-నేను నిత్యుడను-జనన మరణములు లేనివాడిని-శాశ్వతుడను

(ii) ఈ దృశ్యమాన జగత్తు అంతా లేనిదే-ఉన్నట్లు గోచరిస్తోంది. ఇది మనోకార్యము-మాయా కార్యము. భ్రాంతి చేత జగత్తులో ఉన్న జగత్తు స్వప్నావస్థలో లేదు. స్వప్నావస్థలో ఉన్న జగత్తు జాగ్రత్తలో లేదు. ఈ రెండు జగత్తులు సుషుప్త్యావస్థలో లేదు. అంటే జగన్మిథ్యా అని రూఢి అవుతుంది. ఈ శరీర సంఘాతం కూడా జగత్తులోకే వస్తాయి.

(iii) కాని నేను మాత్రం అన్ని అవస్థలలోనూ అంటే జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థలో కూడా ఉన్నాను. అన్ని అవస్థలకు అందులో జరిగే కార్యకలాపాలకు సాక్షిగా ఉన్నాను. కాని ఆ కార్యకలాపాలకు నా కెట్టి సంబంధము లేదు. అవి అన్ని కూడా జడ పదార్థాలే-కాని నా సాన్నిధ్యం వల్ల చైతన్య శక్తి వంతమవుతున్నాయి. అది ఎలాగంటే అయస్కాంతం ఉంది. దాని సాన్నిధ్యమువల్ల, ఇనుప రజను, గుండు సూదులు, ఇనుప పిన్నులు మొదలయినవి జడ పదార్థాలు అయినప్పటికి కదులుతున్నాయి. కాబట్టి నేను అంటే 'బ్రహ్మ సత్యం' జగత్ అంటే చూడబడే దృశ్యమాన ప్రపంచము శరీర సఘాతంతో సహా 'మిథ్య' అని శ్రీ ఆది శంకరాచార్యుల వారు చెప్పింది రూఢి చేసుకోవాలి. కాబట్టి **'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా'** నిస్సంశయంగా నమ్మి సాధన చేయాలి.

(iv) ఈ 'నేను' అనే ఆత్మ సర్వ జీవులలోనూ ఉండి ప్రకాశింప చేస్తుంది కాబట్టి అది పూలమాలలో దారంలాగ ఉంది. దృగ్గోచరము కాకపోయిన ఆ విధంగా విచారణ చేసి సర్వ జీవులలో ఉండే ఆత్మ నేను ఒకటే, వేరు కాదు అని అయమాత్మా

బ్రహ్మ అనే ఈ వ్యాక్యాన్ని అనుభవం ద్వారా తెలుసుకోవాలి. ఇది సహజ సమాజ స్థితిలోకి రాగానే అనుభవానికి వస్తుంది, చేసే సాధన శక్తి వల్ల.

(v) ఈ సాధనతో 'తత్' అంటే ఆ బ్రహ్మ పదార్థము 'త్వం' అంటే నీవు 'అసి' అయి ఉన్నావు. అనే తత్త్వమసి మహావాక్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి.

(vi) నీలో నుండే ప్రజ్ఞా, సర్వ జీవ రాసులలో ఉండే ప్రజ్ఞ అంటే 'ఎరుక' ఒకటే అని ఈ ఎరుకను అనుభవం ద్వారా ప్రజ్ఞానం బ్రహ్మ అనే మహా వాక్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి.

ఒక్కసారి ఆహం బ్రహ్మాస్మి అని సాధన ద్వారా తురీయావస్థలో అనుభూతి పొందినప్పటికి నిత్య నిరంతరం దానిని నెమరు వేసుకుంటు ఇంకా తీవ్ర సాధన చేయక పోతే మిగిలిన మహా వాక్యాలు అనుభవంలోకి రావు. సహజ సమాజ స్థితికి చేరలేరు. కొంత మంది ఒకసారి నిర్వికల్ప సమాధి గురు శక్తి పాతం చేత కలిగినప్పటికి, త్రిగుణాలలో నిండి ఉన్న జగత్తు పూర్వపు అలవాటు చొప్పున మాయచే సత్యమని నమ్మిచ్యుతుడవటానికి సావకాశముంది. ఒకడు లాటరీలో ఒక లక్ష రూపాయలు సంపాదించాడు. లక్షాధికారి అయాడు. కాని జాగ్రత్త పెట్టుకోక ఇంద్రియ లోలుడై వ్యసనాలకు అలవాటుపడి లక్ష రూపాయలు ఖర్చు చేశాడు. దాని ఫలితంగా బికారి అయాడు. కాబట్టి అదే విధంగా నేను నిర్వికల్ప సమాధి పొందాను. నేను బ్రహ్మమును-నా కంటే సగుణారాధులు ఇతరులు ఎక్కువ కాదు అనే అహంకారంతో చ్యుతుడవటానికి ఎక్కువ అవకాశాలున్నాయి. అహం బ్రహ్మాస్మి అనే మహావాక్యం అనుభవం ద్వారా తెలుసుకున్న తర్వాత ద్వంద్వాలకు లోబడి మాయచే మళ్లీ జగత్తు సత్యమని నమ్మి చ్యుతుడయినవాడు అజ్ఞానికంటే ఎక్కువ శిక్షార్హుడవుతాడు. తెలుసుండి చేసిన తప్పుకదా! అందుచేత జాగ్రత్తగా ఏమరిపాటు లేకుండా నిత్యనిరంతరం ఆత్మలో నిలకడకలిగి ఉండాలి.

ఈ ఆధ్యాత్మిక సాధనలో ఎవరు ఎంతవరకు పురోగించ గలిగారో ఒక కొలమానిక ఉంది. ఆ కొలమానికలే సప్త భూమికలు. ఈ సప్తభూమికల అవస్థలు ఏ విధంగా నిర్ణయించుకోవాలి నేను వ్రాసిన మోక్ష సాధన అనే పుస్తకంలో విపులంగా

వివరించాను. అందులో చెప్పినటులుగా వ్యవహరిస్తు సప్తభూమికలు దాటి విదేహ కైవల్యమనే మోక్షస్థితిని పొందండి. పాఠకుల ఉపయోగార్థమై 'మోక్షసాధన' పుస్తకములోని సప్త భూమికలస్థితి ఈ క్రింద పొందుపరచడమయినది.

## సప్తజ్ఞాన భూమికలు

పై విధముగా తీవ్ర సాధన చేయు ముముక్షువు తాను ఏ స్థితిలో నుండెనో నిర్ణయించుకొనుటకు ఆధ్యాత్మిక సాధనలో ఎంత వరకు పురోగమించినది తెలుసుకొనుటకు ఈ కిందనుదహరించిన సప్తజ్ఞాన భూమికలు తోడ్పడగలవు. అవి (1) శుభేచ్ఛ (2) విచారణ (3) తను మానస (4) సత్త్వాపత్తి (5) అసంసక్తి (6) పదార్థ భావన (7) తుర్యగ. ఈ భూమికలను అధిరోహించిన మహాత్ముడు పునర్జన్మలేని మోక్షమును పొందుచున్నాడు.

**(1) శుభేచ్ఛ :** ఈ భూమికలలో వారు ఈ దృశ్యమాన ప్రపంచము అంతయు మిధ్య అయినప్పటికి సత్యమని భ్రమించితిని. ఇది నిస్సారము కదా! నాకు వైరాగ్యము ఎట్లు దృఢపడగలదు. ఈ దుఃఖరూప సంసారమునుండి ఎట్లు తరించగలను. ప్రేయో మార్గము అవలంబించి జన్మ పరంపరలలో చిక్కు పడితిని. పునర్జన్మలేని మోక్ష స్థితికి దారియేది. జీవుడు శరీరము వదలినంతనే వేరొక శరీరములో కర్మానుసారము ప్రవేశించుచుండగా ఈ మరణము శరీరమునకే కదా! జీవుడు కూడా శాశ్వతుడే కదా! జీవత్వము పొందు పరబ్రహ్మలో లీనమగుట ఎట్లు? నాకు ఈ మోహం ఎట్లు నివారణ మగును? ఆత్మ నశించదుకదా! ఇట్టి ఇచ్ఛకలుగుటచే సర్వ విషయములందు తీవ్ర వైరాగ్యము కలుగుటచే తత్ పదార్థమెరుంగుటకు సత్ గురువుల అన్వేషణ ప్రారంభించును. ప్రేయో రూపమయిన స్వర్గాదులయందు కూడా అనిత్యమనే బుద్ధి భ్రమనివారింపబడగు దానియందు ఇచ్ఛ సమూలముగా నశించును. ధర్మాత్ముడై మెలగుచు మూఢ కార్యముల జోలికి పోక, పరులకు అపకారము తల పెట్టక సజ్జన సహవాసము చేయుచూ, సత్ గ్రంథ పఠనము చేయుచూ తన స్వస్వరూపము ఎట్టిదో తెలిసికొన

ప్రయత్నించును. మోక్షపదమునకు బ్రహ్మజ్ఞానమే శరణ్యమని నిశ్చయించుకొని ఆ తత్త్వ జ్ఞానము తెలుపు గురువు కోసం పరితపించును.

**(2) విచారణ:** ఈ విధంగా శుభేచ్ఛలో పరిపక్వ స్థితిని బొందిన విచారణ అనే భూమికలో ప్రవేశించుచున్నాడు. ఈ భూమికలో అనుభవనీయుడైన పుణ్య పరిపాక వశమున సద్గురువును ఆశ్రయించి వేదాంత విచారణ ప్రారంభించును. అంటే శృతి స్మృతుల రూపశాస్త్ర పరిచయము, ధ్యానము మొదలగు యోగ పరిచయము, సజ్జన సాంగత్యము ద్వారా గురువు ద్వారా తత్త్వ రహస్యములన్నీ తెలిసికొనును. అట్టివాడు తీవ్ర వైరాగ్యముచే విషయములను దోష దర్శనముచే విచారించి విడిచి, రాగద్వేషములకు అతీతుడై, కామము జ్ఞానమునకు నిత్యవైరి అని తెలిసికొని, దేహాత్మ బుద్ధిని తగ్గించుకుంటూ జ్ఞానము పవిత్రమైనది, పరమ శాంతమయినది, మోక్షసాధనమని గ్రహించును. జ్ఞాన బలముచే కర్మ నాశనమునకు ప్రయత్నించును. ఈ భూమికలో కార్యవ్యవస్థ, కర్మ వ్యవస్థ బాగుగా తెలుసుకున్న వాడగును. అందుచే కర్మవలనగాని, పుత్రులవలనగాని, ధనముచేగాని ముక్తి కలుగదని నిశ్చయించుకొని ఒక్క త్యాగము ద్వారానే అంటే అహంకార, మమకార కర్తృత్వ త్యాగము ద్వారానే మోక్షప్రాప్తి కలుగునని నిశ్చయించుకొని **'సకర్మణా నప్రజయా, ధనేన త్యాగేనైకే న అవృుతత్వ మానసుః'** దీనిలో ముముక్షువుపురాణ శ్రవణము చేయుచూ మంచి కర్మలను శాస్త్రముల ద్వారా నెరిగి అనిష్ఠించు చుండును. వాదము అభిమానము, మాత్సర్యము, రోషము, అసూయ, ఓర్వలేని తనము, ఈర్ష్య మొదలైన అసురగుణములను దూరము చేసుకొనుచూ అటువంటి విషయములపై ఏ మాత్రము మమత్వము, అభిమానము చూపక నిర్మల చిత్తముతో తత్సంగము ద్వారా సర్వ ప్రపంచమందును బ్రహ్మ రూపమున నిశ్చయించుకొనుచుండును. ఈ భూమికలో చిత్త శుద్ధిని పొంది విచారణ ద్వారా సమాధి ద్వారానే జ్ఞానము పొందవచ్చుననే నిశ్చయమునకు వచ్చును. అట్టి జ్ఞానము ద్వారానే సర్వ కర్మలు ధ్వంసమొనర్చునని **'జ్ఞానాగ్ని దగ్ధ సర్వ కర్మాణాం'** పునర్జన్మలేని మోక్షమునకు హేతువు అగునని తెలిసికొనును. ఈ ఆత్మ తత్త్వము గురుకృప, ఈశ్వరకృప, ఆత్మ కృపలేనిదే కలుగదని నిశ్చయించుకొని సర్వ కర్మలు బ్రహ్మ భావముతో చేయును.

'జీవో బ్రహ్మైవనా పరః' అను శృతులయందు దృఢ విశ్వాసము కలిగి యుండును. అరిషడ్వర్గములు విడనాడును. నిష్కామ కర్మ ద్వారా కర్తృత్వమును విడిచి కర్మాచరణ చేయుచుండును. సిద్ధ పురుషుల సాంగత్యము కోరుచుండును. అకర్మ, వికర్మ, సకర్మల తత్త్వము తెలిసికొనుచుండును. జ్ఞానియొక్క ప్రవర్తనను తెలుసుకొనుచుండును. జ్ఞానమందు ఆసక్తిచే జితేంద్రియుడై అనన్య భక్తిచే వస్తు సమ్యగ్జ్ఞానము పొందుచున్నాడు. ఈ విధంగా జ్ఞాన సముపార్జనకు సర్వవస్తు సామాగ్రిని సిద్ధ పరచుకొని ఈ భూమికయందు పరిపక్వత చెంది తరువాతి భూమిక అయిన తనుమానసి అనే భూమికను పొందుటకు అర్హుడు అగుచున్నాడు.

**(3) తనుమానసి:** పై విధంగా శుభేచ్ఛ, విచారణ బలంతో సర్వ వస్తుసంబంధ రాహిత్యము చేసుకొని ఈ భూమికను చేరుచున్నాడు. ఈ భూమికను ఆశ్రయించిన వ్యక్తి విషయాలయందు విజృంభించు మనస్సును స్థిర పర్చుకుంటాడు. గురు శాస్త్రాలయందు శ్రద్ధా వంతుడవుతాడు. తత్త్వ వస్తు పరిజ్ఞానము దృఢమవుతుంది. అందుచే సర్వ భోగములను మిధ్యాత్మ నిశ్చయము చేయుటచే వాటిని పరిత్యజిస్తాడు. సత్సంగంలో పాల్గొంటూ బ్రహ్మ ప్రసంగాలలో కాలము గడుపుతాడు. ఇంద్రియాలను విషయముల మీదికి పోనీయక వాటి గోళములయందు నిలుప గలుగుతాడు. వస్తులబ్ధికి సత్వగుణ ప్రధానుడుగా మనస్సు స్థిర పరచి 'స్వస్వరూపమయిన ఆనందరూప సమాధి ఎపుడు కలుగునా అని తపన పొందుతూ సాధన తీవ్రత చేస్తాడు. మానసిక కోరికలు కూడా వుండకూడదని, నిగ్రహం, అమనస్క స్థితిని పొందించు సత్వగుణమును ఆశ్రయించును. భగవద్గీతలో చెప్పబడిన దైవీ సంపద యొక్క ప్రాధాన్యతను గుర్తించి తదనుగుణంగా ప్రవర్తిస్తూ జ్ఞాన పరికరములన్నీ చేర్చుకొని శ్రవణము చేస్తూ ఉంటాడు.

**(4) సత్త్వాపత్తి:** సత్త్వాపత్తి అంటే సత్య స్వరూపుడగు ఆత్మయందు నిలకడ కలిగి ఉండటం. క్రిందటి భూమిక దాటిన వానికి నేను కర్తను కాను, భోక్తను కాను, సుఖ దుఃఖములన్నియు పూర్వజన్మకృతములై ఈశ్వరాధీనములయినవి. అందుచే నేను నిమిత్త మాత్రుడను. సంపత్తు, భార్యా, పుత్ర మిత్రాదులు, గృహారామక్షేత్రాదులతో కలుగు సంయోగములన్నీ వియోగము కొరకే. అవి దేహ

సంబంధములే. ఈ అహంకార రూపమై ఉండు ఈ శరీరము సత్యము కానపుడు మమకార రూప 'నాది' అనే ప్రతి పదార్థమందు దోషనిర్ణయము చేసి తీవ్రవైరాగ్యములో ఉంటాడు. ఇది దృఢ పడుతూ రాగా దుష్టుల విడనాడి సజ్జనుల నాశ్రయించి నిరంతరము మనస్సు నందు స్థిర పరచుచూ వస్తు తత్త్వజ్ఞానమందు ఆసక్తి కలవాడై మౌనమును స్వీకరించి సంకల్ప రహితుడై నిస్సంకల్ప స్థితిలో ఉండుటకు అవలంబించును. పై విధముగా శుద్ధ సత్వాన్ని ఆశ్రయించుటే మూడవ భూమిక దాటిన వానికి తత్వమసి అను వాక్యార్థముపదేశమునకు అర్హుడౌతాడు. నాల్గవ భూమికకు చేరుకుంటాడు. ఈ భూమికలో సాధన చతుష్టయ సంపత్తిని పూర్తి పొంది కర్తృత్వ రహితుడై అహం మమలను విడనాడి 'తత్త్వ మసిమహా వాక్యార్థమును గ్రహించి **'అహం బ్రహ్మాస్మి'** వృత్తిని స్వీకరిస్తాడు. ఈ రీతిగా మనస్సును ఆద్యంత శూన్యము అఖండైకరసము, శాశ్వతము, సర్వోత్కృష్టము, పూర్ణ చంద్రోదయమువలెనుండు పరబ్రహ్మ స్వరూపముగా అనగా 'ఇదియే నేను' అనే సమాధి రూప అనుభూతిని గురుశక్తి పాతముద్వారా ఆనంద రూపమును అనుభవము తెచ్చుకుంటాడు. ఈ విధంగా సంసారమూలాజ్ఞానముతో సహా **'జ్ఞానాగ్ని సర్వ కర్మాణాం భస్మ సాత్కురేర్జున'** అని నటుల సంసారము పూర్తిగా విలయమై ఉత్కృష్టమయిన సద్ఘన, చిద్ఘన, ఆనంద ఘనరూప బ్రహ్మతన స్వరూపముగా అనుభవిస్తాడు. అంటే నిర్వికల్ప సమాధి అనుభవిస్తాడు. ఈ విధంగా తాను అనుభవిస్తున్న స్థితియేం నాల్గవ భూమిక అయిన సత్వాపత్తి. ఈ భూమికయందున్న వానిని బ్రహ్మ విదుడుగా' పేర్కొన బడుతాడు. అటువంటి యోగి **'నచరా పునరావర్తతే'** అని నటుల తిరిగి జన్మను పొందడు.

**(5) అసంసక్తి:** ఈ భూమికి చేరిన యోగిని 'బ్రహ్మ విద్వరుడు' అంటారు. ఎల్లవేళల అంతర్ముఖుడై సుషుప్తావస్థయందుండు వానివలె ఉంటాడు. మరియు ముముక్షులయిన వారికి ఉపదేశము చేయుచూ శౌచస్నానాదులయందు ప్రవృత్తి కల్గిననూ తాను చేయు కొద్ది పాటి వ్యవహారములున్నా అహంకారమే చేయుచున్నదని సర్వ ఇంద్రియ వ్యాపారాన్ని వాటి వాటి గోళములకు అంటగట్టి తాను మాత్రం నిత్యము సుఖము జనన మరణ రూప సంసారముగాని బ్రహ్మయే

నేనని అఖండాకార వృత్తినవలంబించి నిత్యమూ బ్రహ్మయందే చరించుచూ ఉంటాడు. ఏకాంత నిష్టుడయి సదా శుద్ధ బ్రహ్మరూప సమాధి యందుండును. ఈ భూమిక యందు చిత్తము బొత్తిగా ఉండదు. తాను సత్తా మాత్రముగా ప్రతీతి అగుచుండును. మరియు నిత్యతృప్తుడై, సంక్షోభశూన్యుడై సర్వభేదములు లేక పరబ్రహ్మయందె నిలచి ఉండుటచే నిదురించిన వానివలె కానవచ్చును. విషయములందు అనాసక్తుడై ఉండును. ఈ భూమికలో చేరిన మహాత్మను ఏ విషయములు బంధింపవు. వారిని తత్వదర్శిని అని అనుచున్నారు. ఏక స్వరూపమైన **'ఏకమేవాద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన'** అనినటుల ద్వితీయవస్తు రహిత శుద్ధ చైతన్య ఆనంద రూపాత్మ తాననే నిశ్చయము కలిగి సర్వ పరిత్యాగముచే కర్తృత్వ భోక్తృత్వములు లేక తామరాకు మీద నీటి బిందువులాగా వుంటాడు. శరీరాన్ని ప్రారబ్దానికి విడుస్తాడు. **'సర్వమిదం అహం బ్రహ్మైవ'** అని బ్రహ్మతో ఐక్యమును పొందుతాడు. నామ రూపాత్మకమైన జగత్తును కూడా బ్రహ్మగా గాంచుచూ, ఆనందమయుడై ముముక్షు జనులకు ఆత్మతత్త్వము బోధ చేయుచూ బ్రహ్మ విద్వరుడని ఖ్యాతి పొందుతాడు. బాహ్య వ్యాపారమంతయూ గుణకార్యములని నిశ్చయించుకొని సర్వదా ఏకాంతనిష్ఠుడై ఉంటాడు. ఈ విధంగా అసంసక్తిని అధిరోహించిన నిర్గుణ భక్తుడు సర్వ భూతములయందు ద్వేషభావము లేక మైత్రి కలిగి ఉంటాడు.

**(6) పదార్థ భావన:** ఈ భూమికను పొందిన మహాత్ముడు బాహ్యాంభంతర విచక్షణ లేక పదార్థములన్ని బ్రహ్మ భావన చేస్తాడు. అ మనస్కయోగము నాశ్రయించిన వాడై ఆత్మ క్రీడ ఆత్మరతి ఆత్మానందమునే నిత్య నిరంతరము అనుభవిస్తూ ఆత్మారాముడని పిలువబడుతాడు. ఈ స్థితిని పొందిన వాడు తన నిజస్వరూపమును సాక్షాత్కరించుకొని తురీయ స్థితిని పొందినవాడై జీవన్ముక్తుడై మెలుగుచుండును. అట్టి జ్ఞాని **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** యని సర్వమును బ్రహ్మ యందన్వయ పరచుకొని ఆనంద సాగరముల నోలలాడుతూ ఉంటాడు. ఈ ఆరవ భూమికను చేరిన యోగిని నిదురించి నిదురింపని వానివలె వ్యవహారములు చేయు చుండియూ చేయని వానివలె ఉంటాడు. కేవలం పరమానంద నిమగ్నుడై ఉంటాడు.

**(7) తుర్యగ:** ఆరవ భూమికను చిరకాలము అభ్యసించుటవలన బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యమైన అనగా సిద్ధులలో (బ్రహ్మవేత్తలలో) ఉత్తమోత్తమైన తుర్యగ అను భూమికను పొందును. నిర్మలత్వము, పరమశాంతత్వమే ఈ భూమిక యొక్క ముఖ్యలక్షణము. ఈ భూమికలో పరిపూర్ణుడై పూర్ణసుధాకరుని పోలిన నిత్య తృప్తితో, సుఖ దుఃఖముల స్మరణలేక ఆత్మారాముడై తననాశ్రయించిన వారికి అంతఃకరణ సీతలమును కలుగచేయుచూ పరమాత్మతానై మౌన స్థితిలో నిత్య నిరంతరము బ్రహ్మ భావనమనే నిర్వికల్ప సమాధిని ఆశ్రయించి ఉంటాడు. ఈ సప్త భూమికనే 'బ్రహ్మ విద్వరిష్టస్థానమని చెప్పుదురు. వీరు బాహ్యము సర్వము మిధ్య అనే నిశ్చయము ద్వారా సకల సంశయరహితుడై, సర్వదా నిధి ధ్యాసనాపరుడై నిర్వికల్ప సమాధి నిష్టుడై బాహ్యాంభ్యంతర సర్వ వ్యాపారములను మరచి స్వస్వరూపానందమునందే చిత్తము గలవాడై సంసార సాగరమును తరించినవాడగుతున్నాడు. ఈ స్థితికే శివుడని, రుద్రుడని, బ్రహ్మయని అంటారు. ఈ భూమికను చేరిన వారికి మౌనమే ప్రధానంగా ఉంటుంది. వీరు ప్రపంచములోని సర్వ త్రిపుటిలను సమన్వయ పరచుకొని నిర్గుణ, నిర్వికార, పరబ్రహ్మ స్థితిలో ఉండుటయే ఈ భూమిక యొక్క పరిపక్వ స్థితి. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సమస్త జీవకోటి తాను ఎటువంటి ఆనంద స్వరూపుడో అటువంటి ఆనంద రూపులనే భావంతో ఉంటాడు. సర్వ ధర్మములు విడిచి ప్రణవ స్వరూపుడైన బ్రహ్మయేతానై ఆనందఘన స్వపూరముక్తిని పొందును'.

ముఖ్యంగా జ్ఞప్తి యందుంచుకోవలసిందేమంటే నీవు సత్‌చిత్ ఆనంద స్వరూపుడవే. అది అయ్యే ఉన్నావు. ఆ విషయం మరిచి జగత్తు విషయాలలో పడి, ఇంద్రియాల తృప్తి కోసం, నీ కోర్కెల తీర్చుకోవటం కోసం నీ అంతట నీవే అల్పజ్ఞుడవని జీవుడని భ్రమించి వ్యవహరిస్తున్నావు. నీవు ఆత్మ దేవుని అంశం తప్ప వేరుకాదు-శాశ్వతుడను, నిష్క్రియుడను, అని మరచి భ్రాంతిలో పడి జన్మమరణాలనే భ్రమలో తిరుగాడుచున్నావు. కాబట్టి చెయ్యవలసినదంతా అజ్ఞానాన్ని రూపుమాపుకోవటమే-భ్రాంతిని విడనాడటమే-**'బ్రహ్మసత్యం జగన్మిథ్య'**ని నమ్మటమే-గురువు బోధించిన అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి అనే

మహా వాక్యాలని పూర్తిగా విశ్వసించి మనోభావనలు మార్చుకోవటమే. అలా సాధన చేస్తే, అజ్ఞానం పోయి జ్ఞానం జాజ్వలమానంగా ప్రకాశిస్తుంది చీకటిని వెలుతురు ప్రాల దోలినట్లు. ఇది మనస్సు చేత చేయవలసిన సాధనే తప్ప బరువులు ఎత్తక్కర్లేదు-ఉపవాసాలుండి శరీరము సుష్కింప చేయనక్కరలేదు. అడవులకు పోనక్కరలేదు. సన్యసించనక్కరలేదు. ఏమీ కష్టం లేదు. మనోభావం మార్చుకొని, సర్వాత్మ భావన చేస్తూ, సత్సాంగత్యంలో పాల్గొంటూ, ఆత్మవిచారణ చేసుకుంటూ, దేహంతో చేసే ప్రతికర్మ కూడా బ్రహ్మార్పణ భావంతో చేస్తూ సంకల్ప రాహిత్యం చేసుకుంటూ, నిస్సంకల్ప స్థితిలో ఉంటూ ఆత్మలో నిలకడ కలిగి ఉంటే మోక్షము కరతలామలకవుతుంది.

మనలో కొంత మంది ఇంకా ఆత్మానుభూతి కానివారున్నారు. నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతి కలిగినా నిత్య నిరంతరం ఆత్మలో నిలకడ గల్గి యుండలేక జగత్తును సత్యమని అపుడపుడు భ్రమతో పూర్వ వాసనలు బలీయంగా ఉండటం చేత చ్యుతుడయి కర్మలాచరించే వారున్నారు. కాబట్టి మనమందరమూ ఇపుడు చెప్పబోయే సూత్రాలు పాటిస్తే మంచిదని సలహా ఇస్తున్నాను.

(i) ప్రతిరోజు నిర్ణీత సమయములలో సత్సంగము చేసుకుంటూ వేదాంత శ్రవణము అంటే ఉపనిషత్తులు, భగవద్గీత, యోగ వాశిష్టము, వివేక చూడామణి, అష్టావక్రగీత, వేదాంత పంచదశి, అవధూతగీత, శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిన శతశ్లోకం, బ్రహ్మను చింతన, దక్షిణామూర్తి వారి శ్లోకములు మొదలయిన పుస్తకములు మీలో ఒకరు చదువుతూ, మిగిలిన వారు శ్రవణం చేస్తూ, ఆఖరున ఒక గంట పాటు ఆరోజు చదువుకున్న పాఠములోని అంశాలు అన్యోన్యం తర్కించుకుంటూ కనీసం 3, 4 గంటలు కాలము గడుపుతే చాలా మంచిది. సజ్జన సాంగత్యము, వేదాంత గోష్ఠి ఎన్నో జన్మల పుణ్యపరిపాకం వలనగాని కలుగదు. సత్సాంగత్యం వల్ల, నిత్సంగమేర్పడి దాని వలన నిర్మోహత్వం, తద్వారా నిశ్చలతత్త్వము రూఢి అవుతుంది.

(ii) ఎన్నడూ నాస్తికులతో సాంగత్యంచేయకండి. వితర్క వాదులతో చెలిమి చేయకండి. ఉపనిషత్తులలో గురువు గారు వ్రాసిన పుస్తకములలోని అంశాలు

పాటిస్తే చాలు మోక్షమార్గములో పురోగమించటానికి. వాటిమీద పరిపూర్ణ విశ్వాసముంచండి.

(iii) బ్రహ్మ పదార్థము వాక్కులకు అందదు అవాఙ్మనస గోచరము. అందుచేత వితర్క వాదులలో గాని నాస్తికులతోగాని వారిని మార్పు చేద్దామనే సంకల్పంతో వాదనకు దిగవద్దు. వారికి దూరంగా ఉండండి. పూర్తిగా అజ్ఞానిని నమ్మించవచ్చు దారి చూపవచ్చు లేదా పూర్తి జ్ఞానితో కూడా సంభాషించవచ్చు. ఎందుచేతంటే అటువంటి జ్ఞానుల సాంగత్యముతో వారి అనుభవాన్ని బట్టి మనము నేర్చుకోవలసినవి ఉంటాయి.

(iv) సర్వత్రా ఎల్లప్పుడు ఆత్మలో నిలకడ గలిగి ఉండండి. ఆ స్థితి నుండి చ్యుతుడవకూడదు. సర్వకర్మలను బ్రహ్మంగా భావించి చేయటం వల్ల సాధ్యమవుతుంది.

(v) పూర్తి వైరాగ్య మవలబించాలి. వైరాగ్యమంటే గృహాన్ని, భార్యా బిడ్డలను విడిచి పోవటం కాదు. అది సన్యాసమనిపించుకోదు. సరి కదా అల్లా విడిచి వెడితే వారిని అన్యాయం చేసిన కర్మకు బాధ్యులవుతాము. వైరాగ్యమంటే అహంకార త్యాగవే సన్యాసము. వాసనా త్యాగవే సన్యాసము. నామ రూపాలతోనూ, త్రిగుణాలతోనూ కూడి జగత్తును, సత్యమని నమ్మటం భ్రాంతి. అట్టి భ్రాంతి విడనాడి అంటే విశ్వాసము అంటే నమ్మకమును విడనాడి జగత్తును కూడా బ్రహ్మ పదార్థంగా చూడటమే పూర్తి సన్యాసము. అట్టి త్రిగుణాలతో కూడిన జగత్తును సత్యమని నమ్మి వాటిమీద ఒక భావమేర్పరచుకొని కర్మలు చేస్తే చ్యుతుడవుతాడు.

(vi) తాను కాని దానిని తాననుకోవటం అహం కారం. తనది కాని దానిని తనది అనుకోవటం మమకారం. అందుచేత దేహభ్రాంతి అంటేనేను జడరూపమైన దేహమనే భ్రాంతి వదలి. ఇది తనది అని దానిపై మమకారం వదలి **'అహం బ్రహ్మాస్మి'** లో నిలకడ కలిగి ఉండాలి. దేహభ్రాంతి ఉన్నంత కాలం మోక్షార్హుడు కాడు.

(vii) సర్వాత్మ భావన చేయాలి. ప్రతి ప్రాణిలోనూ ప్రతి వస్తువులోనూ ఆబ్రహ్మ చైతన్య శక్తి విరాజిల్లుతోంది. అందుచేతనే అవి ప్రకాశ వంతమవుతున్నాయి. నీలోనున్న బ్రహ్మ చైతన్య శక్తి వాటిలో నున్న బ్రహ్మ చైతన్య శక్తి ఒక్కటే. ఏమీ భేదం లేదు. దీనిని బట్టి నీవు అన్నిటిలోనూ ఉన్నావు. అన్ని నీవై ఉన్నావు. ఇది పరమ సత్యం. ఇది పూర్తిగా నమ్మి అయమత్మా బ్రహ్మనే మహావాక్యం రూఢి చేసుకోవాలి.

(viii) కాబట్టి అన్ని జీవరాసులయందు తన ఆత్మయందు ప్రేమ ఉంచాలి. ప్రేమే దైవం. కరుణ ముదిత అనే మహా ఆశయాలను వృద్ధి చేసుకోవాలి. భగవంతుడు భావ ప్రియుడు-ప్రేమ ప్రియుడు-ప్రేమే దైవం. మీరు ఏమి నైవేద్యం పెట్టారు-ఎంతకర్పూరం వెలిగించి హారతి ఇచ్చారు-ఎన్ని ఉపవాసాలున్నారు అది చూడడు. ఇట్టి మూఢనమ్మకాలు వదలి ఎల్లప్పుడు సర్వాత్మ భావన చేస్తూ సర్వ జీవులయందు కరుణ, ప్రేమ కల్గియుండి తత్సంబంధమైన కర్మలు బ్రహ్మార్పితంగా చేస్తూ ఉండాలి.

(ix) **'అహంబ్రహ్మాస్మి'** అనే మహా వాక్యం అనుభూతి ద్వారా విజ్ఞానం సంపాదించిన తరువాత ద్వంద్వాతీతుడవాలి. అనుభూతి అయిన తర్వాత కూడా ప్రారబ్ధ కర్మ బట్టి కష్ట సుఖాలు, లాభ నష్టాలు కలుగవచ్చు. అవన్నీ శరీరానికి వదిలేసి సాక్షి రూపకంగా చూస్తూ ఉండాలి. ఎందుచేతంటే ఆ ప్రారబ్ధ కర్మ అనుభవించటానికి శరీరము తీసుకొని వచ్చాము కాబట్టి తాను అంటే **'అహంబ్రహ్మాస్మి'** అనే మహా వాక్యము తీసుకున్నాడు కాబట్టి, తాను శరీరము కాదు అని రూఢి అయింది కాబట్టి ప్రారబ్ధ కర్మ ఫలితాలను అనుభవించటానికి శరీరాన్ని వదిలిబెట్టి తన మనస్సుని బ్రహ్మ చింతన చేస్తూ తానులో నిలకడ గలిగి ఉంటే ప్రారబ్ధ కర్మలను కూడా సునాయాసంగా దాటి వేయవచ్చు. జీవితంలో కలిగే దుఃఖాలను, కష్టాలను ధర్మబుద్ధితో వివేక బుద్ధితో సహించి వాటికి సాక్షిగా ఉదాసీనంగా సహించుటే తపస్సు. ఈ స్థితిని అలవరచుకోవటానికి నిత్య నిరంతరం తీవ్ర సాధన అవసరం.

(x) పూజలని, నోములని, ఉపవాసాలని, యాత్రలని, వ్రతాలని

మూఢాచారాలు వదలాలి. తీవ్ర సాధన ద్వారా, విచారణ ద్వారా అహంబ్రహ్మాస్మి మరియు తత్త్వమసి అనే మహా వాక్యాలని ధ్యానం ద్వారా అనుభూతిని పొంది విజ్ఞానం పొందుతే వాటంతట అవే మిమ్మల్ని వదిలి పెడతాయి. అలా కాకపోయినా అపుడు పూజలు వగైరాలు చేయటానికి ఇంద్రియాలకు అప్పగించి మీరు బ్రహ్మ చింతనలోనే ఉంటారు. ఇది అనుభవం ద్వారా కాని సాధ్యంకాదు. ఆ స్థితికి మీరందరూ రావాలి.

(xi) ఈ దృశ్యమాన జగత్తంతా త్రిగుణాలతో నిండి ఉంది. అంటే తమో గుణము, కర్తృత్వ భావంతో రజో గుణము, సత్త్వ గుణము. ఈ త్రిగుణాలతో చేసే కర్మలే బంధానికి కారణాలవుతాయి. సత్త్వ గుణంతో చేసే కర్మలుకూడా బంగారు సంకెళ్లు అవుతాయి. అందుచేత శుద్ధ సత్వాన్ని ఆశ్రయించాలి. అంతఃకరణం మీద ఎప్పుడు ఏదో గుణం ఆవరిస్తుంది. ఎప్పుడు ఒకటి ఉండదు. ఒకటి ఖాళీచేయగానే ఇంకొక గుణం అవరిస్తుంది. ఆ గుణావరణలో ఉన్నప్పుడు చేసే కర్మ ఫలితాలు పక్వానికి వస్తాయి, ముందు ముందు అనుభవించటానికి. ఉదాహరణ ఈ రోజు సత్సంగంలో వేదాంత బోధకి వెడదామనుకొని వస్తున్నాడు. ఆ సంకల్పము సత్వ గుణం ఆవరించటం చేత కల్గింది. తీరా వచ్చింతర్వాత వేదాంత బోధ వింటుంటే పై ఫ్యాను గాలి వల్ల చిన్న కునుకు వచ్చింది. శ్రవణంలో అంతరాయం కల్గింది. ఇది తమో గుణం వల్ల. తీరా వేదాంత శ్రవణం ఒక గంట చేసిన తర్వాత అర్జంటుగా ఉన్న ఇంటి వద్ద పనిమీద ధ్యాస పోయి లేచి పోయాడు ఆ కార్యము నెరవేర్చుకోవటానికి. ఈ సంకల్పం రజో గుణం వల్ల వచ్చింది. అందుచేత త్రిగుణాల ధర్మాలను జ్ఞప్తియుందుంచుకొని వాటిని వివేకంతో దాటాలి. అందరూ నేను చేస్తున్నాను నేను చేస్తున్నాను అని అంటారు. నేను అనగా ఆత్మ. ఆత్మకర్మ చేయదు. అధ్యాస చేత అట్లా అంటాడు. విచారణతో కర్మ త్రికరణాలతో (మనస్సు, వాక్కు_కాయము) చేయబడుతోందని తెలుసుకోవాలి. వాటిని ప్రలోభాలకు లోను కానియ్యకూడదు. సంకల్ప రాహిత్యమే రాజబాట. ఇది మనోకార్యము. ఈ మనస్సు ఎంత సేపూ భూతకాలమందు జరిగిన సంఘటనలను నెమరు వేయటం గాని, భవిష్యత్తులో జరుగబోవు వాటిపై సంకల్పాలు చేయటం గాని పరిపాటి. సంకల్పాల ప్రవాహమే మనస్సు. అందుచేత ఎల్లప్పుడు మీరందరు నిస్సంకల్ప స్థితిలో ఉంటూ

ఆ మనస్సుని అహం బ్రహ్మాస్మి అనే మహా వాక్యం మీద లగ్నం చేస్తే బ్రహ్మై పోతుంది. ఒక్కసారి నిర్వికల్ప సమాధి ద్వారా స్వస్వరూపానుభావం కల్గితే అంటే ఆత్మానుభూతి కల్గితే అంటే అఖండానంద స్థితిని అనుభవిస్తే అది విడిచి పెట్టదు. అంతవరకు మన సంకల్పాలు, భావనలలో జాగ్రత్త పడాలి.

(xii) ఎల్లప్పుడు ఎవరు మీ మీద ఏ అభిప్రాయంతో ఉన్నారు. వారి భావనలు మీ మీద ఏ విధంగా ఉన్నాయో అని విచారిస్తూ సుఖ దుఃఖాలకు లోను కాకండి. వారి భావనలు మీ మీద ఏమి ఫలితములు కలుగ చేయవు. ఇతరుల యందు మీ భావన, మీ సంకల్పాలు కల్గితే కల్గిన వెంటనే విచారణ చేసి ఆ భావనలు సంకల్ప రూపం దాల్చకుండా ఆ సంకల్పం క్రియా రూపకంగా మారకుండా త్రుంచి వెయ్యండి. ఇది తీవ్ర విచారణ ద్వారానే సాధ్యమవుతుంది. ఇది మీరు అంతర్గతంగా చేయవలసిన పని. అందరియందు సద్భావన చెయ్యండి. సర్వాత్మ భావన చెయ్యండి. ద్వేషిస్తే ప్రేమతో జయించండి. కష్టాలున్న వారితో ప్రేమతో, కరుణతో మాట్లాడి మీకున్నంతలో నిష్కామంగా సహాయాలు చేయండి. కోరకుండానే రోగులకు, పసి పిల్లలకు వయోవృద్ధులకు సహాయం చేయటం యోగంగా మారుతుంది.

(xiii) ఈ సభలో మహా వాక్యోపదేశం తీసుకోని వారుండవచ్చు. వారికి నేనిచ్చే సలహా ఏమంటే ప్రతి ఫలాపేక్ష లేకుండా సత్కర్మలు చేస్తూ ఉండండి. దుష్కర్మలు చేయకండి. ఇష్టదైవము యొక్క నామాన్ని నిత్య నిరంతరం ఏ పనిచేస్తున్నా జపం చేస్తూ ఉంటే చిత్త శుద్ధికి దోహదం చేస్తాయి. చిత్తశుద్ధి అవుతేనే కాని భగవత్ సాక్షాత్కారం కాదు. నిష్కామంగా మీకున్న దానిలో దాన ధర్మాలు చేస్తూ నారాయణ సేవ చేస్తూ ఉండండి. పుణ్య తీర్థాలు-అన్నార్తులకు భోజనం పెట్టటం-తల్లి తండ్రుల సేవ, దైవభక్తి కల్గి యుండటం, మొదలయిన దైవీ సంపదలు అలవర్చుకోవటం-సజ్జన సాంగత్యం-సాధు పుంగవుల దర్శనం-దేహ సంబంధీకుల యందు విద్యుక్త ధర్మాలు నెర వేర్చటం, రాగ ద్వేషాలు, లోభత్వం, మోహం, మద మాత్సర్యాలు తృష్ణ మొదలయిన గుణాలకు లోను కాకుండటం అనే ప్రవర్తన కల్గి యుండాలి. ముఖ్యంగా తీవ్ర ముముక్షత్వం-దానికై తత్పరత కలిగి యుండాలి. ఇవన్నీ పాటిస్తూ ప్రతిరోజు ఆధ్యాత్మిక సాధనలో చేసిన సాధన, పురోభివృద్ధి

అనుభవాలు ఒక డైరీ వ్రాసుకుంటూ ఉంటే సాధనలోపం ఉంటే తెలుస్తుంది.

(xiv) ముఖ్యంగా పాటించవలసిన విషయమేమంటే అన్ని దానాలలో జ్ఞానదానం చాలా గొప్పది. మీలో చాలా మంది అహం బ్రహ్మోస్మి అనే మహావాక్యాన్ని తీసుకుని నిర్వికల్ప సమాధిని పొందిన వారున్నారు. మీ శక్తి ఉన్నంత వరకు మీరు సంపాదించిన విజ్ఞానాన్ని మీ వద్ద ఒక జీవి తాను తరించటానికి నీ సహాయార్థమై వస్తే, ప్రేమతో వారికి ఆత్మబోధ చేసి వారికి సహాయం చేయండి. ఒక జీవిని ఆ విధంగా బంధాలను తొలగించుకొని మోక్ష ప్రాప్తి కలగటానికి కారకులవుతారు. ఆ విధంగా గురు ఋణము తీర్చుకోండి. ఇంతకంటే మించిన జ్ఞానం లేదు.

నత్యహం కామయే రాజ్యం, న స్వర్గం నపునర్భవం కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తి నాశనమ్ ||

ఓం సర్వేషాం స్వస్తి భవతు! ఓం సర్వేషాం శాన్తిర్భవతు! ఓం సర్వేషాం పూర్ణం భవతు ||

ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై ||

**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

# నాల్గవ రోజు ఉపన్యాసము

**పరిశుద్ధాత్మ స్వరూపులారా!** గడచిన మూడు రోజులనుండి అధ్యాత్మిక జ్ఞానయజ్ఞము ఆ గురుదేవుని కృపాకటాక్షముచే అన్ని విషయాలు కూలంకషంగా తర్కించుకొని తెలుసుకున్నాము. ఈ రోజు ముగింపు రోజు కాబట్టి ఇంతవరకూ చెప్పుకున్న విషయాలు సింహావలోకనం చేసి గట్టి చేసుకుందాము. ఇక్కడకు వచ్చిన వాళ్లందరిలో కొందరు సమాధి వచ్చిన వారే. నేనంటే ఎవరో తెలిసిన వారే. సమాధి ఏమని చెబుతుంది. శరీరం నేను కాదు. ఇది అశాశ్వతమయినది. శాశ్వతమయిన సత్యపదార్థం శరీరంలోనే యున్నది. అదే నేనైన నేను. ఈ నేననుకునే శరీరం అశాశ్వతం. ఇది ఎప్పటికైనా పోయేందే. అంటే సంసారం వున్నదని ఒప్పుకుంటున్నాడు. పోయేదేనని నిర్ధారణ చేస్తున్నాడు. అంటే బ్రహ్మ పదార్థాన్ని రెండు క్రింద చేసి, ఒకటి అశాశ్వతం, రెండవది శాశ్వతం. అంటే ఒక రూపాయి వుంటే అర్ధరూపాయి అశాశ్వతం. ఇలా చేయటం చేత ఏమౌతుంది. సాధనకి టైమ్ పడుతుంది. ఈ సాధన స్థితిలో ఈ సంసారంలో ఎలా మసలు కోవాలో చేత కావటంలేదు.

గురువు దగ్గర ప్రమాణం చేసినప్పుడు జగత్తంతా నేనే నిండి యున్నానని గురువు చెప్పారు. అహం బ్రహ్మోస్మి అని దానిని నీవు ఒప్పుకున్నావు. ఇది అనుభవంలోకి రావాలంటే తను ప్రయత్నం చేయాలి. వ్యష్టిగా ధ్యానం చేయాలి. నాలో పరమాత్మయున్నాడు. దేహమసత్యం. ఉన్నది నేనే. నేను ఆత్మనని తేల్చుకున్నాడు. ఇప్పుడు తత్వమసి అనుభవంలోకి రావాలంటే సమిష్ఠి ధ్యానం చేయాలి. సర్వే సర్వత్రావున్న జీవరాసులు ఏ శక్తిచే నడువగలుగుతున్నాయో, ఏ శక్తి వల్ల వినకల్గుతున్నాయో, ఏ శక్తివల్ల మాట్లాడగలుగుతున్నాయో అంటే నడిచే శక్తి, చూచే శక్తి, వినే శక్తి, మాట్లాడే శక్తి సర్వే సర్వత్రా అన్ని జీవరాసులలోనూ అన్ని పనులకు ఆధారంగా ఒకే శక్తి వున్నది. నామ రూపాలు అశాశ్వతం. అందులో వుండేటటువంటి ఆత్మ సత్యం. నేను శక్తిగా జగత్తంతా నిండి నిబిడీకృతమైయున్నాను. నామ రూపాలకతీతంగా యున్నాను. గుణాతీతుణ్ణి, గుణంలేని వాణ్ణి అని ధ్యానం చేయాలి.

పరమాత్మ నిర్గుణుడు. రూపములేనివాడు. సర్వాధారుడు. అతనికి ఆధారములేదు. జీవుడు శరీరముతో తాదాప్యము చెందిన వాడు. దేహాభిమాని. రాగద్వేషములు కలవాడు. సత్వరజో గుణములకు అధీనుడు. కర్తృత్వ భావంతో కర్మలు చేసి ఆ కర్మ ఫలితాలను సంపాదించేవాడు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, అంతఃకరణ (మనసు, బుద్ధి, చిత్తం, అహం కారము) కర్మ సంపాదిస్తున్నాయి. మనో సృష్టి అయిన జగత్తు, ఆ జగత్తుమీద ఆ భాసుగా పెట్టుకున్న చుట్టరికపు ధ్యాస అంటే బాంధవ్య వాసనలు అంటే బుద్ధి యొక్క విశ్వాసముల చేత ఏర్పడినది. జీవత్వం అనేక జన్మలనుంచి బుద్ధి విశ్వాసాల చేత దట్టమైన ముద్రలు మనలో ఏర్పడ్డాయి. ఎంత ధనమున్నా, ఎంత హోదా పేరు ప్రతిష్టలున్నా ఎంత మందీ మార్బలమున్నా చివరికి మనతో యివన్నీ రావు. మంచి చెడుయొక్క వాసనలు పట్టుకెడుతున్నాము. పువ్వులో కంటికి కనిపించకుండా వాసన ఎలా వుందో అట్లా మనమంతా తెలయకుండా బుద్ధి విశ్వాసాలను వాసన రూపంలో రాగ ద్వేషాలు మొదలైన ద్వంద్వాలను ఈ స్థూల శరీరాన్ని వదలి, ఇంకొక కొత్త స్థూల దేహములోకి తీసుకు వెడుతున్నాము. పాత శరీరముతో సంపాదించిన వాసనతో తిరిగి కొత్త శరీరంలో ప్రవేశించి బుద్ధియొక్క నమ్మకంగా ఏర్పడి కొత్త శరీరంతో పాత కర్మను అనుభవిస్తూ తిరిగి కొత్త కర్మ సంపాదిస్తున్నాడు. చెంచాడు ప్రారబ్ధం అనుభవించటానికి వచ్చి కుండెడు ఆగామి కర్మని సంపాదిస్తున్నాడు. ఇదంతా తెలియకుండా జరుగుతోంది అజ్ఞానం చేత. తాను బుద్ధికి మనస్సుకు విలక్షణుడయి వాటికి సాక్షిగా ఉంటూ అజ్ఞానం చేత అంతఃకరణలో కల్గిన వాసనలతో వాటితోను శరీరముతో తాదాప్యతో కర్మలు చేసి ఆకర్మఫలితాలు ప్రోగుచేసుకుంటున్నాడు. అంటే బుద్ధి విశ్వాసం జగత్తులోకి వెళ్లి పరమాత్మ వేరుగా యున్నాడని యాత్రలు చేయమని, గుళ్లకి వెళ్లమని, అష్టోత్తరాలు చేయమని చెబుతోంది. అంటే భగవంతుడు బయట వున్నాడనే విశ్వాసం కల్గియున్నాడు. భగవంతుని బయట వెతుకున్నంత వరకు చిక్కడు అనే జ్ఞానం లేక ఉన్నాడు. సృష్టినంతా వాడుకునే జ్ఞానం తనకున్నది. అంటే సృష్టిని శరీరంతో వాడుకోటం చేత, నగలు ధరించటం చేత, బట్టలు కట్టటం చేత తాను బంధింపబడటం లేదు. కారణమేమిటి. అనుభవించడానికి వచ్చాడు కనుక సృష్టి జన్మకు కారణం కాదు. శరీరంతో తాదాప్యం చెందకుండా తాను వేరుగా

వుండి శరీరాన్ని వేరు చేసి, శాస్త్ర రీతిగా వ్యవహరించినచో బంధం కలగదు. సృష్టిలో పనికి రానిది ఏదీ లేదు. అన్నీ శరీరానికి అవసరమే. అవసరమైనవన్నీ శరీరానికి వాడుకుంటున్నప్పటికీ జ్ఞానంతో శరీరాన్ని తనకన్నా వేరైన ఒక వస్తువుగా చూస్తే కర్మ అంటదు. ఏ బంధము వుండదు. కాని బుద్ధియొక్క విశ్వాసం చొప్పున తన దృష్టి బాంధవ్య వాసన అంటే లేనిదానిమీద పెట్టటం అభ్యాసమయినది. లేనిదానిమీద అభ్యాసం తను కావాలని పెట్టటము లేదు. ఆ చూపు అలాగే అలవాటయి పోయింది. ఆ రకమైన వాసనలతో గూడిన ఉపాధితో వచ్చాడు గనుక. అంటే మానసిక సంసారంతో రాబట్టి ఆ వాసనలు యిక్కడ అనుభవించాలి కాబట్టి ఈ బంధుత్వ వాసన చేత అంతా పరమాత్మగా యున్నప్పటికి బంధుత్వ వరుసలుగా కొడుకు, కూతురు, మనుమడు, మనుమరాలు, భర్త, తదితర బంధువులుగా చూచే భ్రమలో యున్నాడు. కావాలని భ్రమించటం లేదు. భ్రమ సహజమై పోయింది. ఇది పోయి సహజమైన బ్రహ్మస్థితి రావాలి. సృష్టిని వాడుకోవటము, మనోవిశ్వాసాలు సహజమై పోయాయి. ప్రపంచ దృష్టిగా, బాంధవ్య దృష్టిగా, శరీర దృష్టిగా చూడటం తప్పనిపించటం లేదు. అందరికిని పరమాత్మగా చూడటం అనేది కొత్తగా వుండి అతను పరమాత్మగా చూడటం చేత కావటం లేదు. బాంధవ్య దృష్టి వల్ల రాగద్వేషాలు కలిగి మనచూపు, మాట, పనులు చెడిపోయి కర్మగా మారుతున్నాయి. దానివల్ల నీచ జన్మలు, కష్టాలు, నరకం అనుభవించటం జరుగుతున్నది. గురువేమి చెప్పారు. నువ్వు పరమాత్మవు రా బాబు, నీకు సంసారం లేదు. చావు పుట్టుకలు లేవు. భయాన్ని, రాగాన్ని, క్రోధాన్ని వదులు అని చెప్పినా అట్లా చేయటం మనకు చేత కావడం లేదు. ఇది పాము భ్రమలాంటిది. తాడే సత్యం. అలాగే సంసారం, చావు, పుట్టుకలు లేక పోయినా వున్నట్లు భ్రమ చెందుతున్నావు. కల వచ్చింది. మెలకువ రాగానే కల అబద్ధం అని తెలిసింది. అట్లాగే యిప్పుడు జాగర్త అనే కలలో నీవున్నావు. జాగ్రత్తు స్వప్న, సుషుప్తి అనే మూడవ స్థలంలో నీవున్నావు. ఈ అవస్థలలో కలవకుండా నీవు వేరుగా ఎప్పుడూ వున్నావు. నీకు నామ రూపాలు లేవు. నీవు చూసేవన్నీ మారుతున్నాయి. అవి అశాశ్వతం. నాకంటే భిన్నంగా కనిపించే వస్తువునే నేను చూస్తున్నాను. చూచే దృశ్యం నేనెలా అవుతాను. నా కన్నావేరుగా వున్నా అది నేననే భ్రమలో నేను పుట్టాననే భ్రమ కలుగుతోంది. బుద్ధి, దృశ్యంగా చూడటానికి

అలవాటు పడింది.

సమిష్టిగా సర్వం పరమాత్మనే ధ్యానం చేస్తే అందరికి నామరూపాతీతమైన పరమాత్మానుభవం కల్గుతుంది. ఒక చీర వున్నదంటే దాని ప్రింటు మీద వున్నది నీ దృష్టి చీరమీద లేదు. ఆ చీర బ్రహ్మ పదార్థంగాయున్నది. అలాగే నీవు ఆత్మను చూడటానికి బదులు నామరూప గుణాలకు విలువ ఇచ్చి ప్రపంచ దృష్టిగా చూస్తున్నావు. జగత్తంతా నిండియున్న ఆత్మను ధ్యానం చేసినట్లయితే తత్త్వమసి అనుభవంలోకి వస్తుంది. అప్పుడు నామరూప గుణాల మీద విశ్వాసం పోతుంది. నామ రూపాలు ఆభాసుగా ఉన్నాయి. కలలో విషయాల వలె లేనప్పటికి వున్నట్లు ఎలా భ్రమ కలుగుతుందో ఈ జాగర్తలోనివన్నీ కూడా ఆ రకంగా లేక పోయినా వున్నట్లుగా భ్రమ కలుగుతున్నది. జాగర్తలో విషయాలు లేనివే, ఎందుకంటే శరీరం, మనస్సు, బుద్ధి ఆత్మ తప్ప అన్నీ మారేవే. యివిలేక పోయినా వున్నట్లు కనిపిస్తున్నాయి. ఆత్మ ఉనికి వల్లనే కీటకము నుండి బ్రహ్మవరకు ఉనికి కలిగి యున్నాయి. ఆత్మ ఉనికి లేనట్లైతే దేనికి ఉనికి లేదు. ఇదంతా కూడా తాత్కాలికమై, కళ్లకు కన్పించినా, నిజము కాదు అనే విశ్వాసముతో నామ రూపాలను తుడిచి వేసి ఆత్మను పరమాత్మగా చూడాలి. చాలా కాలం నిరంతరంగా తైల ధారవలె విసుగులేకుండా సంతోషంగా ఇష్టంగా అంతా పరమాత్మేననే సమిష్టి ధ్యానం చేయాలి. అప్పుడు మనసు మనో రూపాన్ని పోగొట్టుకొని ఆత్మ రూపం పొందుతున్నది. పొందటమేమిటి అది ఎప్పుడూ ఆత్మగానే వున్నది. భ్రమచేత ఆత్మను మనసుగా చూస్తున్నావు. ఉన్నదంతా బ్రహ్మ పదార్థం. వైరాగ్యం చేత వైరాగ్యమంటే శరీరాన్ని ఒక పద్ధతిగా వుంచటం వైరాగ్యం కాదు. నామ రూపాల మీద నమ్మకం లేక పోవటమే వైరాగ్యం. నామ రూపాలతో అంతర్లీనంగా వున్న పరమాత్మను సర్వత్రా చూడడమే భక్తి. ఇది జ్ఞానము ద్వారానే సాధ్యం. భక్తి జ్ఞాన, వైరాగ్యాలు సమపాళ్లలో వుంటేనే కాని తత్త్వమసి మహావాక్యం అనుభవంలోకి రాదు. తత్త్వమసి అనుభవములోకి వచ్చి నిత్యనిరంతర సమాధి స్థితిలో నిలబడి వుంటే పరిస్థితి వచ్చినప్పటికి యింకా మనకు సంసారం వుంది. సమాధి పోయి సంసారంలో కల్గటములేదు. కారణమేమిటి. సంసారం శరీరంతో కూడినది. చుట్టాలు, బంధువులు, మనసు పని చేయటం అనేక భ్రాంతులు కల్గియుండటం చేత నీకు ఆనందం కల్గటంలేదు. గురు బోధతో,

గురు శక్తితో తత్త్వమసి అనుభవములోకి వస్తే వైరాగ్యం కల్గాలి. సమభావం రావాలి. రాగద్వేషాలు పోవాలి. అహంకార మమ కారాలు పోవాలి. విషయ చింతన పోవాలి. ఇప్పుడు వైరాగ్యం వచ్చిందంటున్నారు గాని ఇది తాత్కాలిక వైరాగ్యం. వచ్చినట్లే వచ్చి జారిపోతుంది. కాసేపు ఖాళీగా వున్నప్పుడు అనిర్వికారాన్ని ధ్యానం చేసుకొని నేను సమాధిలో వున్నానమ్మా. నాకు తత్త్వమసి అనుభవంలోకి వచ్చింది నేను చాలా హాయిగా వుంటున్నాను అంటున్నారు. కాని నేను నమ్మటం లేదు. కారణమేమిటి. నిజంగా సమాధి వస్తే, నిజంగా వైరాగ్యం కల్గితే అది పోదు. చూస్తున్నప్పుడు వైరాగ్యం వుంటున్నది. పని చేస్తున్నప్పుడు వైరాగ్యం వుంటున్నదో లేదో గమనించటం లేదు. రాగ ద్వేషాలు పనిచేస్తున్నాయి. వాళ్లు వచ్చారంటే బాధ కల్గుతోంది. అంటే సంసారంలో వుండి మాయకు లోబడి మళ్లీ విచారించుకోవాల్సి వస్తోంది. నన్ను ఒకసారి దొంగతనం చేస్తుంటే మీరు చూచారు. దొంగ అని నిర్ధారణ అయిపోయింది. పదే పదే నన్ను చూడగానే దొంగని అనుకోవలసిన పని లేదు కదా. అలాగే జగత్తు లేదని నిర్ధారణ అయింది. నామ రూపాలు అసత్యమని నిర్ధారణ అయింది. ఇవన్నీ లేవని నీకు తెలిసినప్పుడు నామ రూపాలు కనిపిస్తే వాటిమీద నమ్మకం కల్గటానికి వీలులేదు. కాని నమ్మకం కల్గబట్టేగా విచారించుకోవలసిన అవసరం కల్గింది. అంటే సరయిన జ్ఞానంతో నీవు లేవని చెప్పాలి. వచ్చే పోయే భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు మీరు కల్గియుండుట చేత మీరు అక్కడ నిలకడ చెందలేక పోతున్నారు. పాము లేదు తాడే వున్నది అని నిర్ధారణ అయిన తరువాత పాము భయం కల్గటానికి వీలులేదు. ఒకసారి పోయిన జగత్తు మరలా ఎలా వస్తుంది. నిద్ర పోతే ఎవరికి పాఠం చెప్పాలి. నిజంగా జ్ఞానం కల్గితే రాగద్వేషాలు, అహం మమలు, విషయ వాంఛలు కర్మకు ఫలాపేక్షకోరటం పోవాలి కదా. నీకు నిజంగా నిత్య నిరంతరం పరమాత్మలో నిలకడ కల్గి ఉంటే సంసారం తిరిగి రావటానికి వీలు లేదు. విచారించుకోవాలనే జబ్బు ఎప్పుడొచ్చిందో సంసారం పోలేదు. సంసారం పోతే విచారించనవసరం లేదు. భ్రాంతి పోతే, జ్ఞానం కల్గితే కర్మ సంపాదించబడదు. ఈ స్థితి సంపాదించిననాడు అజ్ఞానాన్ని విచారించవలసిన పని వుండదు. నామ రూపాలు కనిపిస్తున్నా అవి అబద్ధం అని తెలిసి పోయాయి కనుక ప్రాపంచిక విషయాలు చెప్పటాన్ని ఇష్టపడడు. పచ్చి పచ్చిగా మాటలు వినినా కూడా ఇప్పుడు తన నోటితో ఆ ముక్కలు చెప్పటాన్ని

సిగ్గుపడతాడు. సముద్రంలో అనేక నదుల ద్వారా నీరు చేరుతున్నా అది చెలియలి కట్టను ఎలా దాటటం లేదో అట్లా ఎన్ని విషయాలు తెలియ బడుతున్నా మనస్సులో ఏ మాత్రం వికారం కల్గదు. దేనినీ కోరడు. అంతా బ్రహ్మగానే కనిపిస్తుంది. అన్యం కనిపించదు. ఇదే అమనస్కస్థితి. అజ్ఞానం నిజంగా వుంటేగా పోవటానికి. మనస్సు, ఇంద్రియాలను అణచటం కాదు. అంతా పరమాత్మే. కానీ మనస్సులో భావన ఎలా కల్గుతుంది. రెండవది కనిపిస్తే గదా భావన రావటానికి. అట్లా భావాతీత స్థితి సహజం అవ్వాలి. కావున విచారించవలసిన అవుసరం కాని వూరుకోబెట్టే అవుసరం కాని కల్గదు. శరీరాన్ని కవులుకి తీసుకొని దానిని వాడుకుంటున్నాం. నియతి ప్రకారం శరీరం నడుస్తున్నది. ప్రారబ్ధ కర్మానుసారంగా సృష్టి శరీరానికి అవుసరం కాబట్టి తింటున్నారు. తిరుగుతున్నారు, అన్నీ వున్నాయి. దేనిని ఆపేదేమీలేదు. నామనోభ్రాంతి తొలగడం చేత తాను శరీరంతో ఏకం చెందకుండా వుండటం చేత మానసిక వత్తిడి పోయింది. అందుచే శరీరం నడుస్తున్నా, వ్యవహారం జరుగుతున్నా, బంధువుల మధ్య యున్నా, ఇదంతా నిజమనే భ్రమ లేనందున ఎప్పుడు సుఖ, దుఃఖాలకు అతీతమైన ఆనంద స్థితిలోనే యున్నాడు. ఆనందమే తానుగా యున్నాడు. ఇదే మోక్షస్థితి. శరీరంలో ప్రాణం వుండగానే మోక్ష స్థితి. సినిమా యాక్టరు ఆ కథతో ఏకీభవించి, కష్ట సుఖాలు అనుభవిస్తున్నా నేను ఫలానా వాడిని, ఇదంతా నటన, నిజంగాదు అని తెలిసినట్టి పరిస్థితులలో వేషంతో ఏకమయి నటన చేస్తాడే కాని మనో వికారం చెందకుండా వుంటాడు. వేషంతో తాదాప్యం చెందినట్లుగా కన్పడుతాడు కాని చెందటంలేదు. అదే విధంగా తాను శరీరంతో తాదాప్యం చెందినట్లు కనిపిస్తున్నా తాదాప్యం చెందకుండా యుండాలి. జగత్తనే సంసారంలో జాగ్రత్తలో జాగ్రత్తగా వుండి, ఆత్మ అనే జాగర్తలో వుండి, శరీరాన్ని కలగా చూడాలి. అజ్ఞానమనే సినిమా చూస్తున్నాము. ఈ కనిపించేది సినిమాయని, కలయని, మనము అనుకోలేక పోతున్నాము. ఎందుకని శరీరం ఆత్మ ఏకంగా కలిసి వుండటం చేత. అమ్మా మాకు సంసారం పోలేదు. ఏమి చేయమంటారు. మాకు గెలవటం రాలేదు అంటున్నారు. ఎందువల్ల? గురువు మీద గురుబోధ మీద విశ్వాసం లేదు. విశ్వాసమున్నట్లయితే వచ్చేదే. వారేమి చెప్పారు? నీవు పరమాత్మవని అన్నారు. ఈ శరీరమనే ఇంట్లో ఏవుందో చూడమన్నారు. ఇప్పుడు ఈ స్విచ్ నొక్కితే

పాడుతుంది, పలుకుతుంది. నొక్కక పోతే పలుకదు కదా. అలా నీ బుద్ధియొక్క చూపు, అజ్ఞానమనే చూపు. నీ భ్రాంతి గల చూపు సృష్టిమీద వుంది. సృష్టిని వాడుకోటానికి వచ్చింది ప్రారబ్ధం ప్రకారం. నీ దృష్టిలోపం చేత, పరమాత్మగా చూచే బదులుగా, నామరూప గుణాలుగా చూడటం అలవాటయింది. నువ్వు పొడవుతున్నావని నీవనుకోటంలేదు. నీకు తెలియకుండానే నీలో అజ్ఞానం ప్రవేశిస్తున్నది. అంటే నమ్మక రూపంలో, విశ్వాస రూపంలో, ప్రారబ్ధరూపంలో వాసనగా ప్రవేశిస్తున్నది. నీకు ఏమి కావాలో తేల్చుకోవాలి. ఒక సూదికి దారం గుచ్చాలంటే, సూది బెజ్జంమీద చూపు నిలిపితే సూదిలోకి దారం ఎక్కించగలం. ఎప్పుడైతే చూపు యింకొక దాని మీదకు పోయిందో దారం సూదిలో గుచ్చలేము. ఎందుచేత? చూపు బెదిరింది. అట్లా బుద్ధి విశ్వాసం నామ రూపాలమీద, బంధుత్వాలమీద, కనిపించే దానిమీద వుంటే, ఇటువంటి అలవాటుంటే ఎలా? చూపు పరమాత్మ మీద పెట్టరా బాబు మోక్షం వస్తుంది అంటే అలా చేయటం యిష్టం లేక పరమాత్మ మీద దృష్టి వుంచటం చేతయి కూడ చేయుటం లేదు. అజ్ఞానముగా సంసారం మీదే మీరు మీ దృష్టి పెట్టటం ఇష్టపడుతున్నారు. ఇదయిన తర్వాత, ఈ కార్యమయిన తర్వాత, ఈ పనయిన తర్వాత పరమాత్మ మీద దృష్టి వుంచుదామని తాత్సారము చేస్తున్నారు. మోక్ష ప్రయత్నం అంత ముఖ్యమనిపించటంలేదు. అవ్వా కావాలి, బువ్వా కావాలంటే ఎలా కుదురుతుంది. సంసారాన్ని వదిలితే గాని పరమాత్మలో వుండలేవు. ఏ సంసారం వదలాలి, బాహ్యంగా నామ రూపాలతో గూడిన సంసారాన్ని వదులుకోవడం కాదు. అంతర్గతమైన, బుద్ధి విశ్వాసాలను వదలాలి. శరీరంతో కలిసిపోయి ఇదంతా ప్రారబ్ధమని అనుకోవటం వదలాలి. అరిషడ్వర్గమనే దొంగలకు లోబడి కర్మ సంపాదించే సంసారం, ఇంద్రియాలు నీ స్వాధీనం నుండి తప్పించుకొని వాటి ఇష్టారాజ్యంగా కర్మ సంపాదించే సంసారం వదలాలి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే విషయాల వ్యామోహమైన చూపు, మాట, కర్మ వదలాలి. ఒక వస్తువు పోతే ఏ పని చేస్తున్నా పోయిన వస్తువు మీదే మనదృష్టి వుంటుంది. అంటే మనకు కావలసిన వస్తువు మీద దృష్టి పెడతాము. ఇప్పుడు నీకు కావలసినది ఏమిటి? ఈ ప్రపంచంలో ఈ నామ రూపగుణాలు కల్గిన వస్తువులలో నీకు కావలసినది మోక్షమే

ననుకున్నప్పుడు నీవు సర్వకాల, సర్వావస్థలయందు, పరమాత్మమీదే నీ దృష్టి వుంచాలి. ఏ క్షణాన చస్తామో, చావు నిజంగా వుందనే నమ్మకముంటే చస్తే ఏ జన్మ వస్తుందో మరలా మానవ జన్మ వస్తుందనీ నమ్మకమేమిటి? అనేక రకాల జీవరాసులున్నాయి (84,00,000). చచ్చిన వారు కబురు చేశారు కాదు. ఉత్తరమన్న రాయరు. ఇప్పుడు నేను నా పురుష ప్రయత్నం చేత నాకు కావలసినదేమి? నేనేమి చేయాలి? ఏమి చేస్తే హాయిగా వుండగలను? ప్రపంచము మీదనున్న బుద్ధి యొక్క చూపును మరలించి పరమాత్మ మీద పెట్టి నట్లయితే సంసారమనేది అంటుకోకుండా వుండేది. చూపు పరమాత్మమీద లేకుండా మనోసృష్టి అయిన త్రిగుణాలతో నిండిన నామరూప జగత్తు మీద పెట్టటం చేత మనస్సును అంతర్ముఖంగా లోతుకు వెళ్లడానికి అవకాశం కుదరటం లేదు. ఎక్కడి కక్కడ సరిపెట్టుకొని బతుకుతున్నాం. మెలిక తిప్పుకోటం రావటం లేదనే చెప్పుకోవాలి. ఈ సంసారం నిజంగా లేదు. వుంటే పోనేపోదు. లేని సంసారం మీద భ్రాంతి కలగటం అలవాటయింది. శరీరానికి రోగమున్నదని కనుక్కున్నదెవరు? ఆ రోగానికి ఫలానా మందు వేసేసుకోమన్నదెవరు? చుట్టాలు బంధువులు వున్నారని ఎవరు చెప్పారు? సృష్టిలో పదార్థాలను ఎవరు గ్రహిస్తున్నారు? ఈ వస్తువు దీనికి పనికి వస్తుందని నిర్ధారణ చేసేదెవరు? వారే ఈ సంసారంలో వున్నారు. ఇప్పుడు వారంతా కలిసి. దేహంలో వుండి మనకు కావాలని చెప్పి ఈ సృష్టిని వాడుకొని నిజం కాక పోయినా అమ్మో మేము పడిపోయామమ్మా. మళ్లీ దిద్దుకుంటాము అంటున్నారు. శరీరాన్ని వేరు చేసి దానిని చూచే వాడిగా వుండటానికి బదులు శరీరమే నేననే భ్రమలో వుండటమే. ఈ అయోమయానికి కారణం మోహమే. దీనికి కారణం సరైన అవగాహన లేక పోవటం చేత వైరాగ్యం లేక పోవటం చేత జ్ఞానంలో నిలకడ లేక పోవటం చేత మాటి మాటికి శరీరంతో కలవటం చేత భ్రాంతికి లోనవుతున్నారు. సూర్యుడు ఎప్పుడూ ప్రకాశిస్తున్నప్పటికి మబ్బు అడ్డురావటం చేత సూర్యప్రకాశం కనిపించటం లేదు. అలా అజ్ఞానం ఆవరించటం చేత వున్న వస్తువు వున్నట్లుగా గోచరించటం లేదు. నిజంగా వున్న వస్తువు వున్నట్లుగా గోచరించినట్లయితే మన చూపుచెదిరేదికాదు. పూర్తిగా మనకు మెలకువరాలేదు. సర్వకాల సర్వావస్థలయందు పరమాత్మమీద దృష్టి వుంచినట్లయితే శరీరంతో పనులు చేస్తున్నా నిత్యం పరమాత్మ

స్మరణలో వుంటే ఈ నామ రూపాల మీద నమ్మకం పోయి భ్రాంతిచే చూపు చెదరకుండా వున్నట్లయితే మనం హాయిగానే వుండేవారము. నామ రూపాలు లేవని చెబుతూ, సంసారం పోయిందని చెబుతూ మన చూపు మళ్లీ నామ రూపాల మీద పెట్టినట్లయితే ఎలా పరమాత్మను అనుభవించేవాడి క్రింద వున్నాడు? ఆనందంలో కల్తీ కలుస్తోంది. సగం చచ్చి, సగం చావకుండా వున్నాడు. గురుశక్తిచే వచ్చిన ఆనందం కల్తీలేని 24 కారట్ల బంగారం లాంటిది. కల్తీ లేని పూర్ణానందం నిల్చి పోవాలంటే, మనోబుద్ధి ఇంద్రియాలు మన స్వాధీనం అవాలి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలచేత ఈడ్వబడకూడదు. శరీరంమీద విషయాల మీద ఏ మాత్రం అభిలాష వుండరాదు. సర్వం పరమాత్మగా తెలియబడాలి. మనసులో వికారం రాకూడదు. ఇలాకల్తీ తీసేసుకోవటం అలవాటవ్వాలి. మెలుకువ వచ్చిందంటున్నాము. కాని మెలుకువ రాలేదు. అబద్ధమాడుతున్నాడు. తాత్కాలికంగా మెలకువ వచ్చింది. కలలో కష్టసుఖాలు అనుభవించినట్లున్నా మెలుకువ వచ్చాక కల అబద్ధమని తెలిసినా దానిని ఇతరులకు చెప్పాలనిపిస్తుంది. ఫాను కట్టేసిన తరువాత అది కొంచెము సేపు తిరుగుతుంది. అలాగే తనకు అలవాటయిన సంసారం భ్రాంతి కనుక భ్రాంతి పోయినా మళ్లీ దాన్ని సంసారాన్ని స్మరణ చేయబుద్ధి పుడుతుంది. ఎందుచేత పూర్ణవైరాగ్యం రాక పోవుటం చేత. ఆరకమైన వాడు ఏం చేస్తాడు? పరమాత్మ సత్యం, శరీరం అసత్యం, జడమూ, నాల్గు రోజులుండి పోయేది. అది కర్మ చేయటానికి వచ్చింది. కర్మ ఫలాన్ని అనుభవిస్తుంది. నేనంటే శరీరానికి అతీతమైన, శరీరానికన్నా వేరుగా యున్న జగత్తంతానిండిన సత్‌చిత్ ఆనంద పరమాత్మను నామ రూపాలకతీతంగా యున్నాను. నేను గుణాతీతుడిని. గుణాలు లేనివాడిని అని బుద్ధిలో నిర్ధారణ చేసుకుంటాడు. ఇక్కడ ఈశ్వరమాయ అడ్డుపడుతుంది. అది ఎలా వుంటుంది. ముసుగు జీవుడు లాగా వుంటుంది. కనిపించదు. మనం జ్ఞానులమే కాని ఎవడైనా రోగముతో బాధపడుతున్నాడనుకోండి, చచ్చిపోయాడనుకోండి వాడంతేనండి మొన్నటిదాక వెధవ పనులు చేసేడు. తీసుకోక ఏం చేస్తాడు అనబుద్ధి అవుతుంది. అంటే పొరపాటున, తొందర పాటున పరమాత్మగా చూడటం మాని శరీరాన్ని, గుణాలని, క్రియలను చూచి మాటల ద్వారా బయటకు వచ్చింది. ఆ శబ్దాన్ని వినేసరికి ఆ ఇంద్రియాన్ని జయించలేక

పూర్ణానుభూతి లేక దేహ వాసన పోలేదు. ప్రారబ్ధం, కర్మ అని అనబుద్ధి వేస్తున్నది. పైగా ప్రారబ్ధం మింగిన ముద్ద ఎవరూ తీసేయలేరు. అనుభవించి తీరవలసినదే అని తనను తాను సమర్థించుకుంటాడు. ఎవరైన చస్తే అయ్యో వాడు పోయాడండి. సునాయాసంగా పోయాడు, తీసుకోకుండా పోయాడు చాల అదృష్టవంతుడు అని అంటే నేనూ అలా పోవాలనేగా నా వుద్దేశ్యం. అట్లా ఈశ్వరమాయ అంతర్గతంగా వత్తిడి వల్ల తాను శరీరంతో కలిసి పోయిన పరిస్థితిని శబ్దం ద్వారా వెళ్లగక్కుతున్నాను. నా మాట ద్వంద్వాకారంగా వుంది. శరీరం వుండటం నిజమే. పుట్టడం నిజమే. ప్రారబ్ధం అనుభవిస్తున్నాడంటే నిజమే. బుద్ధి మళ్లీ జీవరూపం పొందింది. గురుశక్తిచే, బుద్ధినమ్మకం చేత నాకు బంధువులు ఎవరూ లేరు అని అన్నా శరీరం, కర్మ, ప్రారబ్ధం చావు పుట్టుకలు, సుఖ దుఃఖాలున్నాయనే బుద్ధి విశ్వాసం పోలేదు. అంతా పరమాత్మగా తెలియ బడటం లేదు. అందుచేత ఆనందంలోని కల్తీని తీసేయ లేక పోతున్నాడు. ముందుకు ప్రయాణం చేయలేక పోతున్నాడు. ఎందుచేత నేను నామ రూప గుణాలకు అతీతమైన నిర్గుణ సత్‌చిత్ ఆనంద స్వరూపుణ్ణి. శరీరమేమో నామ రూప గుణాలు కల్గి అశాశ్వతమైన చావు పుట్టుకలు కల్గియున్నది. శరీరం అనిత్యం మార్పు చెందేది. కలలాంటిది. నిజంగా యివన్నీ లేవు. లేకుండా వున్నాయనే భ్రమ కల్గిస్తున్నది. వున్నదంతా శరీరంతో సహా పరమాత్మే. నేను పుట్టనేలేదు. పుట్టనివాణ్ణి నేను చావటమేమిటి, నేనూ వారు వేరుగ లేము. వాడు పోయాడంటే నేనెలా నమ్ముతాను. ఏం బాగుండదని సానుభూతికోసం అయ్యో పోయారా అని తేలికగా అనటమున్నా పోయాడనే నమ్మిక కల్గి అనటమూ రెంటికి తేడా తెలుస్తుంది. పరమాత్మ కన్నా రెండవది లేదనే దృఢనమ్మికగా వుంటే వాడు జీవన్ముక్త స్థితిలో యున్నట్లు. వాడు దొరకాయగా వున్నాడు. పండుకాదు. ఎందుచేత? శరీర మనోబుద్ధులను, ఇతరమైన వాటిని వాడుకునే వాడుగా యున్నాడు. వీడు పరేచ్ఛా ప్రారబ్ధంగా యున్నాడు. ప్రారబ్ధం మూడు రకాలు. అవి ఇచ్ఛా, పరేచ్ఛా, అనిచ్ఛా. ఈ ముగ్గురకు మోక్షం ఒకటే. అనిచ్ఛా ప్రారబ్ధం మనగా నిత్య నిరంతరం ఆత్మానందం అనుభవించుచూ శరీరము కావలసిన పనులు వాటి కప్పగించి, అంటే వస్త్రము ధరించుట గాని విడుచుట గాని శరీర ధ్యాస లేకుండా శరీర పోషణ కావలసినది, ఎవరినీ కోరకుండా యాదృచ్ఛికంగా ఎవరయినా ఇస్తే తీసుకుంటూ

తుర్యగ స్థితిలో మౌనంగా ఉంటాడు. ఇది జీవితంలో పరమావధి. దీనినే విదేహ వైకల్య స్థితి అంటారు. రెండవది పరేచ్ఛ ప్రారబ్దం ఇదే జీవన్ముక్త స్థితి. ఆత్మశాశ్వతమని, శరీరం ప్రపంచం అశాశ్వతమని యిలా రెండు చేసేడు. అందుకని వాడు దొరగానేయుండి పోయాడు. ఇతరులకోసం కర్మని నిష్కామంగా చేస్తున్నాడు. లోక సంగ్రహం కొరకు కర్మచేస్తున్నాడు. ఈ కర్మ బంధాన్ని కల్గించనప్పటికి కర్మ ఇతరుల కొరకు మాత్రమే చేస్తున్నాడు. వాళ్లకోసం కర్మ చేయాలి. వాళ్లేమన్నా అనుకొంటారేమో. వున్నాం గనక పని చేయక తప్పదు. తనకంటూ ఏ కర్మ చేయడు. స్వార్థంలేదు కాని మనస్సు, బుద్ధి ఇంద్రియాలను వాడుతున్నాడు. అందుకనే దొరకాయ ఇతరుల అజ్ఞానాన్ని పోగొట్టి వారికి మోక్షం కల్గించడం కోసం వాడు శరీరమును పని చేయిస్తున్నాడు. ఇతరుల సాధనలోని లోపాలను ఎత్తిచూపిస్తున్నాడు. అందుచేత తనకు యిష్టం లేకపోయినా యితరుల మనస్సులకు నొప్పి కల్గిస్తున్నాడు. చూచే వారికి రాగద్వేషాలు కల్గిన వాడుగా కనిపిస్తున్నాడు. నిత్య నిరంతరం సమాధిలో వున్నా కూడా పరుల కోసం పని చేయవలసి వస్తోంది. కానీ పరేచ్ఛా ప్రారబ్దంలో యున్నాడు. కల్తీ లేదుగాని కల్తీ కల్గిన వాడుగా ఇతరులకు కన్పిస్తున్నాడు. జ్ఞానే కాని మధురంగా లేడు. మాటలో తీపితనం లేదు. ఎందుకని, ఇతరుల లోపాలు ఎంచవలసి వస్తున్నది కనుక. మూడవది ఇచ్ఛాప్రారబ్దం. జనక మహారాజు లాంటివాడు రాజ్యాన్ని పాలిస్తున్నా నేను పాలించటము లేదని చెప్పే శక్తి కలవాడు. శరీరం పని చేస్తున్నా నేను పని చేయటం లేదని చెప్పే శక్తి గలవాడు రెండవవాడు లేదనే పూర్తి నమ్మకం కల్గినవాడు. మనస్సుని పరమాత్మలో లీనం చేసేసాడు. ఇష్టాయిష్టాలు, రాగ ద్వేషాలు లేవు. బుద్ధిలో ఏ నమ్మకాలు లేవు. ఇదంతా కలని తెలుసుకున్నాడు. మనస్సుంటేనే కదా వారున్నారనే భ్రమ కల్గటానికి, కాన నిర్వికారంగా యున్నాడు. ఉపాధినుంచి వచ్చే అలజడి పోయింది. భర్త కోపంగా వుంటే భార్య ఒక వస్తువు కావలసి వచ్చినా భర్తతో చెప్పటానికి వెనకాడుతుంది. వారు కోపంగా యున్నారు. ఇప్పుడు కాదు శాంతంగా వున్నప్పుడు చెబుదా మనుకుంటుంది. అలా తాను నిర్గుణంగా వున్న తనున్నాడు కాబట్టి శరీరాన్ని పట్టించుకోవటం లేదు. ఏం చెప్పినా వినిపించుకునే స్థితిగా లేదు. అందుచేత జ్ఞానేంద్రియాలు ఏదన్నా చెప్పటానికి భయం కలిగి మా వంక చూచినపుడు చెబుదాము లే అని అనుకుంటున్నారు. ఆయన వీరివంక

చూడరు. వీరు లేరని తెలుసుకున్న తర్వాత వారి మీదకు చూపుపోదు. కాన జ్ఞానేంద్రియాలు ఏమీ చెప్పవు. చెప్పినా ప్రయోజనం వుండదు. చీకటి వుంటే లాంతరు అవసరం. సూర్యుడొచ్చాక లాంతరుతో పనేముంది. ఒకవేళ లాంతరున్నా లేనట్టే. అలా బుద్ధియున్న దాన్ని వుపయోగ పెట్టే అవుసరంలేకుండా పోయింది. బుద్ధిలో పట్టుదల లేకుండా పోయింది. బంధుత్వమున్నా, శరీరమున్నా ఆ బాంధవ్య దృష్టి పోయింది. బుద్ధి నమ్మకాలు పోయినాయి. శరీరం పుట్టేదిగాయున్న తాను పుట్టలేదనే దృఢమైన జ్ఞానం కల్గింది. తానుకాని శరీరం మీద అభిమానం పూర్తిగా పోయింది. శరీరం నుంచి పూర్తిగా విడిపోయేడు. ఒక పండున్నది ఆ పండుమీద చెక్కు తీసి దీనిని డబ్బులిచ్చి కొన్నాంగదా దీన్ని యెలా పారేయాలనే సంకోచముతో కూడా ఆ తోలును విసిరేసినట్లుగా శరీరం మీద అభిమానాన్ని పూర్తిగా వదిలేశాడు. అట్లా మెలుకువ వచ్చింది. పండుమీద తోలులాగా బుద్ధి విశ్వాసాలను విసిరి వేయాలి. బుద్ధితో అవుసరం వుండకూడదు. దేనిని చూడాల్సిన అవుసరం లేదు. వదులు తున్నామని లేదు. వదలాల్సి వచ్చిందే అని లేదు. వేష్టయినది శరీరంలో యున్నాకూడ దాన్ని ముట్టుకోవాల్సిన అవుసరం కల్గటం లేదు. ఇది వరకు అవుసరం వుండేది ఎందుచేత రెండవద్దైన మనస్సుండటం చేత. జగత్తులోకి వచ్చే ప్రయత్నంలో వున్నాను కాబట్టి భగవంతుడు బయట వున్నాడని పరిగెత్తాను కాబట్టి జగత్తులోకి వచ్చి పని చేసే పరిస్థితి వుండేది. ఇప్పుడు వాళ్లందరూ వున్నా వాళ్లకు విడాకులిచ్చినట్లయింది వాళ్లంతా శరీరంలో వుండి సృష్టిననుభవిస్తున్న వాళ్లే రాజాలాగా యున్నారుగాని వాళ్లు చెప్పుకునేందుకు దిక్కు లేకుండా పోయింది. ఇక్కడ వినిపించుకునే నాథుడు లేడు. ఎవరితో చెప్పుకుంటారు. జగత్తులోకి వెడదామా అక్కడ భగవంతుడు కనిపించటం లేదు. మనుషులా జడం లాగా యున్నారు. అందరు తను కల్పించుకొని తెచ్చి పెట్టుకున్నవారే. బాంధవ్య వాసనలు పోయాయి. ఎందుకని వారంతా కలలోని వారని తెలిసింది. సృష్టించింది నేను. సృష్టిగాయున్నది నేను అంతర్లీనంగా శక్తిగా వున్నది నేను. శరీర మనోబుద్ధి అహంకారాలుగా యున్నది నేను. అరిషడ్వర్గ దొంగలను సృష్టించింది నేను. ఆట కోసం సృష్టించుకొని ఆటవదిలేసినట్లు ఆటకు విలువైన సామానులేమిటో, ఆటకు పట్టుదల వచ్చే ప్రదేశమేమిటో, ఆటకి ముందే నిర్ధారణ చేసుకున్నాడు. అవి అన్నీ

తను సృష్టించుకున్నవే కాబట్టి అందులోనే లయమయి ఒక్కటయి పోయాడు. కలని తెలిసింది కనక ఈ సంసారం యిలా యున్నప్పటికి కుమ్మరి పురుగుకు బురద ఎలా అంటదో సంసారంలో యున్న సంసారం అంటుకోదు. మట్టి ముద్దని క్రింద పడేస్తే అది పైకి లేవలేదు. నేలకే అతుక్కుంటుంది. రబ్బరు బంతి పడేస్తే అది పైకి లేస్తుంది. అట్లా జ్ఞానము కొంచవము తెలిస్తే అజ్ఞానంలో పడ్డా మళ్లీ విచారించుకోవటానికి వీలవుతుంది. వీళ్లెవరు తెలియనివారు కారు. ఏది అవుసరమో, దేనిని వుపయోగించుకోవాలో వున్న దేమిటి లేని దేమిటి. దేనిని వదలాలో దేన్ని వుంచుకోవాలో స్పష్టంగా తెలిస్తే జ్ఞానం కల్గుతుంది. ఇవన్నీ స్పష్టంగా తెలియక పోవటం చేత నాకేమీ తెలియటం లేదంటున్నాడు. చేత కావటం లేదు అంటున్నాడు. శరీరంలో వుంటే తెలియదు. ఆత్మగా వుంటే అన్నీ తెలుస్తాయి. విచారణ చేత జ్ఞానంచేత జగత్తును పూర్తిగా తుడిచి వేస్తే బుద్ధికి జగత్తుమీద వున్న విశ్వాసం పోతే జగత్తు కనిపించినా బాధించదు. కర్మ సంపాదించే పరిస్థితి లేదు. జన్మలు తీసుకువచ్చేటటువంటిది తయారవటం లేదు. ప్రారబ్ధం లేదు. కర్మ లేదు. జన్మలేదు. చావు, పుట్టుకలు లేవు. పరిపూర్ణస్థితి నిత్య నిరంతరంగా వుంది. ఎటు చూసినా ఆత్మే కనిపిస్తున్నది. అప్పుడు శరీరం పని చేసినా బంధం కలగటం లేదు. దొరికినది తింటున్నాడు. హాయిగా వున్నాడు. తన వల్ల యితరులకు హాయి. ఇతరుల వల్ల తనకు హాయి. శరీరం, వస్తు, వాహనాలు ఏమీ వదులుకోనవసరం లేదు. శరీరంతో తాదాప్యం చెందకుండా వుండాలి. అప్పుడు కూతురును కూతురుగా చూసినా, కొడుకును కొడుకుగా, భర్తను భర్తగా, బంధువులను బంధువులుగా చూస్తున్నప్పటికీ ఏమీ అంటుకోవటం లేదు. పూర్వం ఎలాయున్నడో అలా వున్నా యాక్టరు పాత్రలో కష్టసుఖాలు అనుభవిస్తున్నట్లుగా నటించినా తనకు అవిలేనట్లుగా స్పష్టంగా ఎలా తెలుసో, అలా తాను సంసారంలో నటిస్తున్నానని తెలుసుకొన్నాడు. సంసారం చూస్తున్నట్లున్నది, అనుభవిస్తున్నట్లు లేదు. కనుక సంసారంలో వున్నవి తనకేమి అంటటం లేదు. సంసారంలో తను ఇరుక్కోవటం లేదు. సంసారం నిజమనే నమ్మకం పోయింది. బుద్ధి బ్లాటింగు పేపరు సిరాను పీల్చినట్లుగా విషయాలను పీల్చటం లేదు. నిత్య నిరంతరం సంసారంలో యిలా మసలు కోవాలి. అలా చేస్తే జ్ఞానేంద్రియాలు అదుపులోకి వచ్చి అయిదు యింద్రియాలకు సమాధి వస్తుంది. ఈ సమాధి కోరుకుంటే వచ్చేదికాదు. ఆహారం అరిగితే తేనువు వస్తుంది.

అరక్కపోతే పులి తేపు వస్తుంది. అలా మనకు తెలియకుండా ఈ సమాధులు వస్తాయి. జ్ఞానేంద్రియాల ద్వారా మనస్సు ఏమి గ్రహించిన స్థితి వస్తుంది. శబ్దాలున్నా వినిపించని, దృశ్యాలున్నా కనిపించని రుచి చూసినా, రుచి తెలియని, వాసనలున్నా వాసనలు తెలియని స్థితి స్పర్శ తెలియని స్థితి వస్తుంది. శరీరం నుంచి, ఇంద్రియాలనుంచి, తను వేరయినట్లు తెలుస్తుంది. మెలుకువ వున్నప్పుడే ఈ సమాధులొస్తాయి. నడిస్తే నేలమీద నడిచినట్లుండదు. తేలిపోతున్నట్లు వుంటుంది. తిమ్మిరెక్కిన కాలుతో నడిచినట్లు వుంటుంది. శరీరంలేదు గడ్డి దుబ్బు నీళ్లు పోసి నానపెడితే వేళ్లతో సహా మనం దానిని లాగొచ్చు. ఎన్ని వేళ్లు నేలను పట్టుకొని వున్నాయో అలాబుద్ధి యొక్క నమ్మకం ఈ శరీరాన్ని పట్టుకుంటుంది. ఆ నమ్మకం ఇంద్రియాల ద్వారా కదులుతున్నట్లు తెలుస్తుంది. ఎప్పుడైతే జ్ఞానమువల్ల వాడికి తెలుస్తుందో అప్పుడు నేను ప్రజ్ఞానం బ్రహ్మనని, నేను స్వయం జ్యోతినని, నామ రూపాలకతీతుడనని నేను గుణాతీతుడనని అంటాడు. ఈ శరీరం కూడా పరిపూర్ణమే అంటాడు. ఎట్లా శరీరం పరిపూర్ణ మవుతుందండి. ఆలోచించండి, ఇందాక అహం బ్రహ్మోస్మి అన్నప్పుడు శరీరం లేదు. నేను ఆత్మను అన్నావు. ఇప్పుడు శరీరం గూడ పరిపూర్ణం అంటావేమిటి. శరీరం సమాధిలో లేదు. నిద్రలో శరీరంలేదు, రాగ ద్వేషాలు లేవు. ఇప్పుడు నీకు శరీరం ఎలా వుంది. అని అడుగు, శరీరం, మనస్సు వుంటేనే గదా నేను స్వయం జ్యోతివని చెప్పటానికి నేను జ్ఞానిని, నాకు సమాధులొచ్చాయి. కర్మ నాకు అంటుకోదు అని నిర్ధారణ చేసుకున్నావు గదా. అసలు కర్మవుంటే కదా అంటుకోవటానికి. ఎందుకు ఇలా నిర్ధారణ చేస్తున్నావు. శరీరమయిన నీవు ఆత్మనయినాకు సంబంధమేమిటి. పరమాత్మ కన్న అక్కడ ఏమీ లేదు. నేను హాయిగా వున్నాను, నిర్మలంగా వున్నాను. అని ఈ చెప్పే జబ్బు నీకెందు కొచ్చింది అంటే శరీరమున్నదనే భ్రమ నీలో బతికి వున్నదన్న మాట. అని ఎవరికి వారు తృప్తి పడ్డప్పుడు అడగాలి. శరీరంలో వుండి నిప్పులు ఆర్పేసామంటే ఎలా. చిన్న నిప్పురవ్వ వున్నామళ్లీ రగులు కుంటుంది. ఏ మాత్రం శరీర ధ్యాస వున్నా జన్మ మరలా వస్తుంది. శరీర స్ఫురణ పూర్తిగా లేకుండా పోతే ప్రశాంతత వస్తుంది. ఓదార్చటానికి అయ్యో పోయారా అని మాట వరసగా అనటానికి, బుద్ధితో పోతారనే, చావు పుట్టుకలున్నాయనే నమ్మకంతో అన్న దానికి తేడా వుంది.

ఆహా మాయ వెంటాడుతోంది. నేను జాగ్రత్తగా వుండాలి. వాళ్ళెవరో పోతే తెలిసింది. నిజంగా చచ్చాడనే నమ్మకం ఇంకా వుంది. అంటే మనస్సు అనగా అజ్ఞానం చావలేదన్న మాట. శరీరం నేననే భ్రమ పోలేదు. జీవత్వం బ్రతికే వుంది. నాలో ఈ లోపం ఇంకా వుంది. నేను స్వయం జ్యోతినని అనబుద్ధి వేస్తున్నది. అంటే రెండవవాడైన మనస్సు వుంది. అంతా పరమాత్మ వున్నప్పుడు మచ్చ గూడా లేకుండా నామ రూపాలను తుడిచి వేసినప్పుడు వున్నది నిర్గుణమే కదా. నిర్గుణమంటే గంజిలో ముంచిన గ్లాస్కో బట్టలా ఏ మచ్చ, ఏ మరక, ఏ మడత లేకుండా వుండటం. అందులో ఈ జీవరాసులన్నీ అణురూపంలో వున్నాయి. నేను స్వయం జ్యోతివని నిర్ధారణ చేసే బుద్ధి యున్నంత వరకు నాలో జీవత్వం పోలేదని తెలుసుకొని, ఇంకా లోతుకు పోవాలి. అంటే జ్ఞానం ఉండాలి. బంగారం కరగపెట్టి కల్తీ తీసేసినట్లు దశేంద్రియాలలో వున్న కల్తీ సంపూర్ణంగా తీసివేయాలి. అలా తీసేస్తే జీవరాసులన్నీ నలకలు నలకలుగా కనిపిస్తాయి. అంటే కిటికీలోనుండి ఎండ ఇంట్లో పడుతుంటే చూసినప్పుడు ఆ ఎండలో దుమ్ములాగా కనిపిస్తుంది. అలాగన్నమాట. ఇదేమిటి తత్త్వమసి వచ్చినప్పుడిట్లా లేదే. అప్పుడు జగత్తంతా నిండిన పరమాత్మలో అణుశక్తి వెండి రేకుల్లా సన్న రజనులా వుంది. ఆహా జ్ఞానం పండిన కొద్ది ఇప్పుడిలా వుంది. బంగారం కనక చెక్కుడు చెక్కితే కంసాలి మైనం ముద్దకు అంటిస్తాడే ఆ రజనంతా నలకలు నలకలుగా జాగ్రత్తంతా నిండిన పరమాత్మలో సకల జీవరాసుల్లో అనువులుగా ప్రకాశిస్తున్నాయి. ఇలా అనేక అనుభవాలు ఒస్తాయి. ప్రకాశంపైకి క్రిందకు తేలుతున్నట్లుగా వుంటుంది. చాలా హాయి అనుభవిస్తాం. దాన్నే చూస్తూ వుండబుద్ధి పుడుతుంది. ఏమిటి నేను స్వయం జ్యోతినంటూ ఇంకా దీన్ని చూస్తున్నాను. చూడటం ఎందుకుంది? చూశేవాడు వేరుగా వున్నాడా? శరీరం ఒప్పుకుంటే గదా నేను చూసేది. చూస్తున్నానని అన్నప్పుడు నేను శరీరాన్ని వదలలేదు. నేను పరమాత్మను అనుభవిస్తున్నాను నాకు హాయిగా వుంది అని అనుకోవటం జీవత్వమే కదా. తాను వేరుగా పోయి వేరుగా రెండుగా వుంటే ద్వంద్వమే కదా? నాకు అనుభవంలో వుంది. నేను నిర్గుణంలో వున్నాను. ఈ కర్మ అంటుకోదు అంటే కర్మ చేయటం వుంది. అది అంటుకోక పోవటం వుంది. నిర్గుణమనే వాసన కూడా వుంది. వాసనా రాహిత్యం కావాలి గదా. వాసన వుంటే నేను పరమాత్మగాయున్నట్లు

ఎలా అవుతుంది? జీవత్వమే కదా. గాఢ నిద్రలో హాయి రూపంలో వుండాలి. అటు ఇటు దొర్లినట్లుగా, గోక్కున్నట్లుగా, ఏదో కుడుతున్నట్లుగా అనిపించిందంటే మనం మెలుకువగా వున్నట్లే కదా? జ్ఞానంగా, పరమాత్మగా హాయిగా వున్న నన్ను కదిల్చేదెవరు? మాయే. ఇంకా మాయనుంచుకున్నావన్నమాట. శరీరంగా వుండబట్టే ఈ విషయం తెలుసుకోగలుగుతున్నాను. ఉపాధి రహితంగా వున్నాననుకొన్నాను గాని వుపాధితోనే వున్నాను. పరమాత్మగా వుంటే ఏ భావమూ రాకూడదే? ఏ నిర్ణయం తీసుకోకూడదే? కర్మ అంటుకోదని చెప్పేవాడెవడు, మనస్సే కాబట్టి ఎప్పుడో ఒకప్పుడు చావు పుట్టుకలు తెస్తాడన్న మాట. ప్రతి క్షణం చస్తాననే భయం కల్గుతుందన్న మాట. చావటమేమిటండి. అసలు పుట్టక పోతేను. నీటి బుడగ శరీరం ఎప్పుడు పగులుతుందో తెలియదు. శరీరం బ్రహ్మ కన్నా వేరుగా లేదు. నీటిలో కఱ్ఱవేస్తే కఱ్ఱ ఇవతల నీళ్ళు, అవతల నీళ్ళు అంటున్నాము. కాని కఱ్ఱ క్రిందనీరు ఏకంగానే వుంది. అట్లా ఏకంగా వున్న పరమాత్మగా నిర్గుణంగా నేనుంటే శరీరమును అడ్డుపెట్టుకొని బుద్ధినాకు సలహా యివ్వటమేమిటి. కర్మ లేదుగదా, ఎండ మావుల్లో నీరు వున్నదనుకోవటం పొరపాటు కదా! నీళ్లున్నాయన్న భ్రమ నిజం, నీరు వుండటం అబద్ధం. శరీరముంటే కర్మ చేసిన కర్మ అంటుకోదని చెప్పడమ్ముంటుంది. శరీరం లేనప్పుడు కర్మ చేయుటమేమిటి? అది అంటక పోవటమేమిటి? చావటమేమిటి? పుట్టడమేమిటి? ఇవన్నీ అబద్ధం. శరీరం వుంటే వుండనీ, పుడితే పుట్టనీ, చస్తే చావనీ శరీరం నేను కాదు అనే పూర్ణ విశ్వాసం ఎప్పుడు కల్గుతుందో అప్పుడు మనకు తెలియకుండానే సమాధి వస్తుంది. ఈ సమాధి వచ్చి సంసారంలో వున్నప్పటికి సలహా యిచ్చేవారు లేరు. సణిగే వారు లేరు. నిర్ణయించేవారు లేరు. ఎట్లా సినిమాలో వేషధారి వేషం కథ ప్రకారం ఒక స్త్రీని వివాహం చేసుకున్నాడు. దానికి ఈ సినిమా వివాహము వేషమని తన అసలు భార్య ఇంటివద్దయున్నదని ఎట్లా తెలుసో అట్లా శరీరంతో జగత్తులో చేసేదంతా నాటకమని, నిజము కాదని, తాను ఈ శరీరానికి వేరుగా యున్నా ఆత్మనని తెలిసి వుంటుంది. సంసారం నిజమనే పరిస్థితి కలగదు. జ్ఞానాగ్నిలో శరీరం, ప్రపంచ సంబంధ ఆత్మకన్న అన్యమైనవన్నీ ఆహుతి అయిపోతాయి. అన్యము లేక పోవటంచేత అంతా హాయిగా వుంటుంది. ఆత్మకన్నా రెండవది నీకు తోస్తే నీవు జీవుడుగా వుండి భ్రమకు

లోనయినట్లే. ఉప్పురాయి నీటిలో కరిగిపోయినట్లు మిగతా వన్నీ ఆత్మలో కరిగి పోవాలి. కాన ఏ భావము పుట్టకూడదు. అందామనిపించదు. బుద్ధి చలనం లేని స్థితిగా వుంటుంది. చిన్న మొక్క గాలికి అటూ ఇటూ కదులుతుంది. కాని మాను అలా కదలదు. మాను గాలికి ఎలా కదలదో అట్లాగే జ్ఞానికి బుద్ధి చలించదు. కాన కర్మ చేసినా చేయనట్లే, మాట్లాడినా మాట్లాడనట్లే. అన్నీ వున్నా ఏమీ లేనివాడే అవుతాడు. భ్రాంతి లేదు, అజ్ఞానము లేదు, చీకటి లేదు, అంతా ఆత్మ వెలుగే. సమాధిని ఆశ్రయించవలసిన అవసరం లేదు. సమాధి ఎప్పుడూ నేను అది కాకపోతే కదా? ఒకటిగా చలనం లేని స్థితి లేకపోతే, రెండవ వాడిగా బుద్ధిగా అవుతే, అప్పుడు కళ్లు మూసుకొని కూర్చోబుద్ధి పుడుతుంది. శరీరం లేక పోతే కళ్లు మూసుకోవటం ఎందుకు? ఎవరిని తప్పించుకోవడానికి కళ్లు మూసుకొని కూర్చోవాలి? ఇంకొకడు లేడు కదా! ఇంట్లోకి కొత్త వారొస్తే మీరెవరని అడుగాలి. ఎందుకొచ్చావని అడగాలి. అలా అడగక పోతే వాడు యిల్లంతా ఆక్రమిస్తాడు. మాయను రానిస్తే అది యిక్కడే చోటు చేసుకొని వుండి పోతుంది. మాయ నిజంగా లేదు. భ్రాంతే మాయ. భ్రాంతిపోతే అంతా హాయి. భ్రాంతిని విచారణా బలంతో జ్ఞానంచేత విడనాడి ఆత్మగా ఉండాలి. శరీరంలో ప్రాణం వుండగానే మోక్షం. ఇచ్ఛా ప్రారబ్ధంగా యున్నాడు. సజీవ ముక్తి కల్గింది. ఎప్పుడూ ముక్తే. ముక్తి గూడా లేదు. ఒక చోటకి పోవాలను కున్నాము. పోవాలనుకున్న చోటికి వచ్చేసాము. వచ్చిన తర్వాత పోవాలనే ప్రయత్నము లేదు కదా. అట్లా మనం పొందవలసిన స్థితి పొందాము. ఇంక చేయవలసినది ఏమిలేదు- ధ్యానంతో పని ఏమి లేదు. ఇంకా ధ్యానం చేయాలని అనిపిస్తే చేరుకోవలసిన చోటుకు చేరలేదన్నమాట. ఇలా అనుక్షణం తనలో కలిగే మార్పును తాను గ్రహించి ఆ మాయ నుండి మెలుకువ తెచ్చుకోవాలి. సర్వకాల సర్వావస్థల యందు జాగ్రత్తలో జాగ్రత్తగా వుండే ప్రయత్నం చేయాలి. తనకు శరీరము యింద్రియాలతో ఎట్టి సంబంధం లేక పోయినా లేని సంబంధం వాడికి అంటగట్టి దానిని లేదని తెలుసుకోవటానికి ఇంత సాధన చేయాల్సి వచ్చింది. నీవు ఎట్లా ఈ ఇల్లనే శరీరంలో ప్రవేశించావో మళ్లీ నీవు ఇందులో నుంచి ఎట్లా బయట పడాలో తెలిసి నీవు వచ్చిన దారిన బయట పడగలిగితే మళ్లీ వచ్చినీవు ఆదుకొని వెళ్లినప్పటికి నీకు కర్మ అంటుకోదు. ఆడటం యెందుకు శరీరంలో వున్నాము

కనుక ఆడుకోవలసి వస్తుంది. ఈ ఆట నిజము కాదని తెలిసినా నియతి ప్రకారము ప్రారబ్ధము వుండుటచేత ఈ శరీరం పడిపోదు. ప్రారబ్ధమే శరీరాన్ని నిలుపుతుంది. ప్రారబ్ధం పూర్తి కాగానె శరీరం పడిపోయి ఆట ముగుస్తుంది. ఇట్టి సాధన చేయటం చేత ఎవరికీ 5 పైసలు కూడ నష్టం లేదు. దీనికి పుస్తకము అక్కర లేదు. చదువు కొనక్కరలేదు. శరీరంతో చేసే పని కాదు మెదడుతో చేసే పని. దూదితో వత్తులు చేసేటప్పుడు చిన్న నలక వున్నా మనం వప్పుకోము. ఎందుకంటే దానిలో చిన్న నలక వుంటే మనకి గుడ్డితనం వస్తుందని భయం. అందువల్ల చక్కగా వత్తులు చేస్తాం. అలా మనస్సుతో బుద్ధి నమ్మకాలను ఎప్పుడూ విమర్శచేయాలి. మన బుద్ధిని మనమే పరిశీలించుకున్నచో మన లోపాలు తెలియబడతాయి. లోపాలంటే ఎలా వున్నాయి. ఇతరుల వల్ల కష్టపడుతున్నామని, నష్టపోతున్నామని, ఇతరులున్నారని ఇటువంటివి మనకు ఇతరులున్నారనే రోగాన్ని కల్గ చేస్తున్నాయి. జన్మ కల్గచేస్తున్నాయి. అని తెలిసి కూడా పరమాత్మ కన్న రెండవది యున్నదనే విశ్వాసముంచుకుంటే మళ్లీ జన్మ తప్పదు. ఇలా ఇప్పటి జన్మ వృధా అవుతోంది. ఈ జన్మలోనే నేనెవరో తెలుసుకోవాలి. సాధన వల్ల నష్టపోయేది లేదు. జ్వరం తగ్గి పథ్యంతింటే ఏమి తిన్నా హితవుగా వుండదు. నోరు చేదు పోలేదు. ఏది రుచించదు. అట్లా స్వస్వరూప ఆత్మ జ్ఞానం కలిగితే ప్రాపంచిక, శరీరక విషయాలు రుచించవు. అన్ని ఇంద్రియాలు బాగా పని చేస్తున్నా విషయాలన్నీ అందుబాటులో సిద్ధంగా ఉన్నా మనసులో ఏది దూరదు. ఇందులో వుండి ఏకీభవించి తిండి తిన్నప్పుడు ఈ సృష్టిలోను పదార్థాల రుచి తెలుసుకొని యున్నాడు. అలవాటుగా కాఫీ తాగితే కాని దానిరుచి తెలియదు. అలా అన్ని యింద్రియాలు స్వాధీనమైనాయి. ఏదీ రుచించదు కాని తినాలి కాబట్టి తింటున్నాడు. ఏ పని చేయాలని వుండదు. కాని కర్తవ్యంగా చేయాలి కాన బలవంతంగా చేస్తాడు. అంతాకలలో జరిగినట్లు జరుగుతుంది. ఇది వరకు మజాగా బాగా తినేవాడు ఇప్పుడు తప్పనిసరి అయి బలవంతంగా తింటున్నాడు. తింటున్నాడు గాని తినటం లేదు. శరీరానికి తినాలి కావున తింటున్నాడు. కాని మనసుపడి రుచులకోసం తినటం లేదు. అజ్ఞానం వుంటే శరీరం మనమీద పెత్తనం చేస్తుంది. జ్ఞానంగా వుంటే అదే శరీరం పనిముట్టులాగా చేయనున్నట్లు చేస్తుంది. ఈ రకంగా సాధన చేయాలి. అదృష్టంవల్ల మనకు

సమర్థుడైన గురువు లభించాడు. ఆయన జగద్గురువు మంచి సాధన చేసి జన్మ సాఫల్యం చేసుకొని మన గురువుకు మంచి కీర్తి తీసుకురావాలి. అందరికి అనుకూలంగా, సౌమ్యంగా వుండాలి. వేదాంతం వచ్చిందని పట్టాకట్టుకుని తిరగక్కర్లేదు. మన సాధన చేత ప్రవర్తన చేత మన ఆత్మ భావన వికసించి ఆత్మ వాసనలు పక్కలకు వ్యాపించి వాడికి నమస్కారం చేద్దాం. వాడి దగ్గర తెలుసుకుందాం అన్న ఆసక్తి ఇతరులలో కలిగించాలి. మన వల్ల ఇతరులకు హాయి, ఇతరుల వల్ల మనకు హాయి కలగాలి. జన్మరాని పరిస్థితిగా చేసుకోవాలి. తనకు తెలిసిన జ్ఞానం నలుగురికి విస్తరింపచేయాలి. వేదాంతుల మని అనిపించుకోవటం కాదు. బయటకు వెళ్లి వ్యవహారం చేయటం మానేసి బుద్ధికి బుద్ధి చెప్పి నిత్య నిరంతరం నేను బ్రహ్మననే నమ్మకం కలుగ జేసుకొని ఇంద్రియాలను ప్రేమ మయంచేసి తనకు ఎలాంటి భ్రమ కల్గినా, మనస్సు ఏమని చెబుతున్నా వినుపించుకోకుండా ఆత్మనేనని నిర్ధారణ చేసుకుంటూ ఈ ఆత్మ ధ్యాసను ఎప్పుడు పెంచుకోవాలి. ఆత్మ శక్తి ఒకటిగానే యున్నది. అనేక శక్తులుగా బహిర్గత మవుతున్నది. ఒక గొట్టానికి, 5,6 పంపులు పెట్టుకున్నాం. వీటన్నిటినీ ఒకేసారి తిప్పాం. ఈ 5,6 పంపుల్లో నీళ్లు సన్నగా వస్తున్నాయి. అన్నీ కట్టేసి ఒక పంపే తిప్పాం. ధారలావుగా వచ్చింది. అట్లాగే జ్ఞానేంద్రియాలయిదింటి ద్వారా బ్రహ్మ శక్తి విషయాలుగా బైటకు వస్తుంది. మనం కావాలని విషయాలలోకి వస్తున్నాం. కనుక బ్రహ్మ శక్తి విషయమయి పోయింది. అది విషయం చేసుకోకుండ, ఆత్మగా చేసుకుంటే ఆత్మ అయ్యేది. నువ్వు చేసుకోటంలో వుంది. నేను భార్యననుకుంటే భార్యనయి పోతున్నట్లనిపిస్తుంది. నేను పుట్టాననుకున్నాను గనుక ఇది భార్య అయింది. పుట్టిన దానికి విలువ యిచ్చా. అసలు నేను పుట్టనే లేదు దాన్ని చూపిస్తున్నాననుకొన్న సాక్షినైనా. పుట్టిందీ లేదు, చూచింది లేదు. సాక్షి అయిందీ లేదు. నేను శరీరం అనుకొన్నప్పుడు ఆత్మాభ్యాసం చేయాలనుకున్నా. ప్రయత్నించి ఆత్మను సాధిద్దామని అనుకున్నా. ఎప్పుడు నేను జీవుడుగా వుంటున్నానను కొన్నానో నేను పెద్ద వాడినైపోయి పరమాత్మ చిన్నవాడైపోయాడు. వాడిని సంపాదించే వాడినయిపోయాడు. డబ్బులు, వస్తువులు సంపాదించటం అలవాటయి పోయి పరమాత్మను కూడా సంపాదిద్దామనుకున్నా, పరమాత్మ వస్తువులను, ఆస్థి పాస్తులను నామ రూపాలను కూడా సంపాదించుకొని

తనలో లయం చేసుకున్నాడు. మనం వస్తువులను వాడుకున్నట్లుగా పరమాత్మను వాడుకోదలుచుకున్నాము. ఈ శరీరంలో వుండి పరమాత్మ అంటే చాలా హాయిండి, చాలా ఇష్టమండి, కొన్ని విషయాల్ని వదలలేక పోతున్నా అంటున్నాడు. నేనంటాను, నీకిష్టమున్నా లేకున్నా నేను పరమాత్మనని పరమాత్మ సీటులో కూర్చో. మనసును చూడు ఏం చేస్తున్నదో తెలుస్తుంది అమ్మ మీద కోపం వచ్చింది. ఎందుకొచ్చిందో తెలుస్తుంది. ఏం కోరితో కోపమొచ్చిందో తెలుస్తుంది. ఎవరు కోరుతన్నారో తెలుస్తుంది. కోరిన దాన్ని గురించి అది ఎంత కాలముంటుందో నచ్చచెప్పు. ఆ కోరిన దానివల్ల సుఖంలేక పోగా దుఃఖమే కలుగుతుందని మనసుకు నచ్చచెప్పు. నీవే సుఖ స్వరూపుడనని బోధచేయి. సుఖాన్ని బయట సంపాదించే పని లేదని మనసుకు నచ్చచెప్పు. మనస్సు చేష్టలో ఇష్టం లేకుండా పోవాలి. మనస్సును నమ్మితే అది చెప్పినట్లల్లా చేస్తే రాగ ద్వేషాలు కల్గి కర్మ చెడిపోయి, జన్మలు కలుగుతున్నాయి. ఆత్మ ప్రపంచమంతటికీ ఆధారం. అయస్కాంత శక్తిచేత ఇనుము కదులుతూ వుంటే భ్రమచే యినుము దానంతటదే కదులుతున్నదని అనుకొంటున్నాం. ఆత్మ శక్తి దేహాన్ని కదిలిస్తూ వుంటే అజ్ఞాన మనస్సు దేహము స్వయం శక్తి వల్ల కదులుతున్నదని అహంకారంతో భ్రమ పొందుతున్నది. శరీరం నేననే నమ్మకం కల్గుతున్నది. విచారణ చేత ఈ నమ్మకాలను పోగొట్టుకోవాలి. జ్ఞానం బలం చేత అన్నిటిని ఆత్మగా చూస్తే ఆత్మగానే కనిపిస్తుంది. నిర్గుణతత్వం బుద్ధిలో దృఢమైతే మనోవాసనలు నశిస్తాయి. భావాతీతమై స్వస్వరూప స్థితి కల్గుతింది. రెండవది లేని తాను తానుగా వుండటం జర్గుగుతుంది. శరీరం మీద నమ్మకం పోతుంది. నీలో పరమాత్మ వుందా? పరమాత్మలో నీవున్నావా? రెండు లేవు. పరమాత్మకు అన్యంగా నీవు లేనే లేవు. నీవే పరమాత్మ, పరమాత్మేనీవు. జీవో బ్రహ్మైవనా పరః, నన్ను నేనెలా చూస్తున్నానో నన్ను నేనలా చూచిననాడు, అద్దంలో బొమ్మను చూచినట్లు అద్దంలేక పోయినా నన్ను నేనట్లా చూచిననాడు అంతఃకరణ అనే అద్దంలో నామరూపాలనే బొమ్మలను చిన్న కంటి గుడ్డు ద్వారా ప్రపంచం మొత్తం చూచి అదంతా నిజమని భావిస్తున్నావు. చూచిన దానికి విన్నదానికి విలువ ఇవ్వకూడదు. మనసు చెప్పిన దానికే విలువ ఇవ్వకూడదు, నా మాట మీదే నాకు నమ్మకం లేకుండా వుండాలి. ఎందుకని ఇవన్నీ అజ్ఞానం నుండి పుట్టాయి. కావున జగత్తంతా సున్నా. తాను సున్నా. ఒకరికి చెప్పటం

కాదు. నీకు తెలిసి రావాలి. శరీరము నేననుకున్నప్పుడు ఇవన్నీ చూస్తున్నట్లు కనిపిస్తున్నది. నేను ఆత్మనను కొన్నప్పుడు ఇవన్నీ ఆత్మగానే యున్నాయి. ఫలానా అని చెప్పటాన్ని కూడా ఆత్మ వుండాలి. వూరుకుంటే ఒకటిగా వుంది. సంకల్పము చేస్తే ఫలానా అని చెప్పాలనుకుంటే చెప్పితే ఒకటే రెండుగా అవుతోంది. తనే సంకల్పం చేస్తే రెండవ వాడైన మనస్సు అవుతున్నాడు. మనస్సు రాగానే అనేకమై పోతున్నాడు. మనసులోకి ఎవరు వస్తున్నారో ఎవరు పోతున్నారో కంట్రోలు చేయలేక పోయినట్లయితే, ఏకాగ్రత కుదరదు. అక్కడ అన్ని ఇంద్రియాలు నన్ను చవటను జేసి, అంటే ఆత్మ శక్తితో ఆ యింద్రియాలు పని చేయకల్గుతున్నా ఆగ్రహింపు లేక, నన్ను ఎదురుగా పెట్టుకొని, ఆ యింద్రియాలు ఇష్టారాజ్యంగా నాటిపని చేసుకుంటున్నాయి. భోగాలు ముఖ్యమయి, ఆత్మస్థితిగా వుండటం ముఖ్యమనిపించుటలేదు. ఇంద్రియాల విషయాభిలాషతో రాగద్వేషాలు కల్గి ఇది చేయవచ్చు. ఇది చేయకూడదు అనే విచక్షణా జ్ఞానం పోగొట్టుకొని కర్మలో ఇరుక్కుంటున్నారు. కొంత మంది విపరీత జ్ఞానం చేత మా ఆయన వచ్చినా మా అబ్బాయి వచ్చినా నేనసలు పట్టించుకోనంటున్నారు. నేనాత్మగా వుండి అన్ని పనులు వదిలేశామంటున్నారు. ఇదొక పిచ్చి. శరీరంతో చేయవలసిన పనులు మానకూడదు. శరీర పోషణ కొరకు, భార్యా బిడ్డల పోషణ కొరకు పని చేయవలసినదే. ధనము సంపాదించవలసినదే. శాస్త్ర ప్రకారము చేయవలసిన పనులు ఏవీ వదిలి పెట్టరాదు. ఇవన్నీ శాస్త్ర ప్రకారంగా, ధర్మ ప్రకారంగా ఇష్టా అయిష్టాలు లేకుండా అహంకారమమకారములు లేకుండా స్వార్థ చింతన లేకుండా అన్నిటిని పరమాత్మగా గ్రహిస్తూ, శరీరంతో పనులు చేస్తూ, మనస్సులో ఏ వికారము లేకుండా మనస్సుతో ఆత్మ స్మరణ చేయిస్తూ చేయాలి ఎల్లప్పుడూ చూపును నిర్గుణంలో వుంచాలి. మనో యింద్రియాలను శుద్ధం చేసి ధర్మ బద్ధంగా వాటిని నడిపించాలి. నేను ఆత్మను శరీరం ఏం చేసినా నాకు అంటు కోదు సంబంధం లేదనటం మోసం. తన్ను తాను మోసం చేసుకొని ఇతరులను కూడా మోసం చేస్తున్నాడు. ప్రవర్తనలో ఏ లోపము రాకూడదు. విషయ వ్యామోహంలో పడరాదు. కొద్ది కాలం జ్ఞానంగా ఆత్మలో వుంటున్నాడు. యెక్కువ కాలం అజ్ఞానములో పడి విషయాలలో చిక్కుకొని, కర్మను పోగుచేసుకుంటున్న మనస్సు ఎప్పుడూ విమర్శ చేసుకుంటూ అజ్ఞానంలో

పడకుండా నివారణ చేసుకోవాలి. ఇదే ముఖ్య సాధన. నిత్య నిరంతరం మనస్సును శుద్ధముగా వుంచుకొని దానితో ఆత్మ స్మరణ చేయించాలి. శరీర యింద్రియాల ధ్యాస రానీయకూడదు. కొంప ఖాళీ చేయాలి. రాజీ పడకూడదు. శరీరానికి మనస్సుకు విడాకులు ఇచ్చేయాలి. కర్మ సంపాదించే వారిని వదిలేశేయాలి. అజ్ఞానాన్ని లోపలుంచుకొని నాకు శక్తియ్యమ్మపైకి పోవాలంటే ఎలా వెడతావు. శక్తి ఎవరి కివ్వాలి. నీకు లేదా శక్తి, బావాల్ని, నమ్మకాల్ని వదిలితే నీ వెపుడూ శక్తి స్వరూపుడువే. నేను జీవన్ముక్తవస్థలో వున్నాను. నేను జ్ఞానిని. వాడు అజ్ఞాని అంటాడు. నిజంగా జ్ఞానయితే-రెండవ వాడు ఎలా వస్తాడు. ఆత్మ ఒకటే కదా. అది ఇది అని నిర్ధారణ చేసే వాడు. నీలో వుంటేనీకు తెలుస్తూనే వుందిగా. వాడేగా రెండవ వాడు. వాడిని ఎందుకు వుండనిస్తున్నావు. అజ్ఞానమని నీకు తెలిసి వుండి కూడా దాన్ని వుంచుకుంటున్నావు. పైగా నెపములేని బయట వాడి మీద తోసేస్తున్నావు. అందరూ మోక్షసంపాదన కొరకే వచ్చారు. ఒకరి బంధువుగా ఎవరూ రాలేదు. లేని బంధుత్వాలను మనమే తగిలించుకుంటున్నాము. లేని చోట నిర్ధారణ చేయటమేమిటి? నీ మనస్సుతో నిన్ను చూచుకో. జగత్తు కనిపిస్తున్నా నమ్మకు. అది అభాసుగా వుంది. లేనిది వున్నట్లుగా కనిపిస్తుంది. ఆత్మ వునికి వల్లనే జగత్తుకి వునికి కల్గింది. కాన వున్నది ఆత్మే. జగత్తు కనిపించిన వున్నది ఆత్మే. వున్నది ఆత్మ అయితే దానిని జగత్తుగా భ్రమ చేత అనుకుంటున్నావు. జ్ఞాని శరీరంతో విడిపోయే మనస్సు ఏమిటో, బుద్ధి ఏమిటో. అహంకారమేమిటో. అవి చేస్తున్న పనులేమిటో కనిపెట్టి వాటిలో దోషాలు లేకుండా చేసుకుంటాడు. జ్ఞాని పాము అన్న భయంలేకుండా తాడు అనే సత్య పదార్థంలో వుండి ఆడుకొంటున్నాడు. వాడికి కర్మ అంటుకోవటం లేదు. ఆటకోసం సృష్టించుకొని ఆడుకొంటున్నాడు. కానపట్టులేదు. జ్ఞాని కర్మను సంపాదించే చోటికి వెళ్లినప్పటికి అవుసరమైనంత వరకు వాడుకొని కర్మను అంటించుకోకుండా జాగర్త పడి ఇవతలకు వచ్చేస్తాడు. మనస్సు మీద పహరా కాచినట్లయితే దాని ఆగడాలు సాగనీయకుండా చూడగలం. మనోరూపంగా వున్నది నేను. వాడు కొంటున్నది నా శక్తి. శరీరము నాది, ఇక్కడ ఫల పుష్పాలుగా వున్న వన్నీ నావి, తిన్నది అరిగించేది నేను. మధ్యలో అహం చెంది ఈ మనస్సు ద్వారా నీవు చ్యుతుడవుతున్నావు. ఎవరూ అజ్ఞానికాదు. ఫలానా వారు

అజ్ఞాని అని నీమనస్సుకి నిర్ధారణ చేస్తే నీవు అజ్ఞానివి అవుతున్నావు. ఇతరుల గుణాలను ఎంచగానే నీవు గుణము గల్గి జీవుడవుతున్నావు. మనసు ద్వారా నిర్ధారణ చేసి. నమ్మకాలు పెంచుకొని వాసనలుగా వుండి జన్మ సంపాదించు కోవటం నీకు ఇష్టంగా వుంటే నీకు పాఠం చెప్పేదేమున్నది. మనస్సుగా రెండవ వాడిగా అవకుండా ఎప్పుడూ జాగ్రత్తగా వుండాలి. మనస్సు సంగతి నిజంగా తెలిస్తే మనస్సును ఎవరూ వాడుకోరు. అది శరీరాభిమానాన్ని కల్గిస్తుంది. హీనస్థితికి జారుస్తుంది. శరీరంతో పని చేయించాలి మనస్సుని చేయకుండా ఆపాలి. గురువు దగ్గర వుంటే నీ ఆటలు సాగవు. నీ ఆటలు సాగాలంటే మనస్సు దగ్గర వుండాలి. మనస్సు దగ్గర వుంటే జన్మలొస్తాయి. కాన మనస్సును వదిలించుకొని శరీరాన్ని కాదనుకొని జగత్తుకలని నిర్ధారణ చేసి కొని పరమాత్మనేనని నిర్ధారణ చేసుకోవాలి. ఎప్పుడూ నిర్వికారంగా వుంటూ జగత్తంతా నిండిన పరమాత్మనే ఎప్పుడూ చూస్తూ శరీరాలు కనిపిస్తున్నా అవుసరమైనమాట అవుసరమైన పనే చేయాలి. రహస్యం మాటలుండరాదు. ఇలా వుంటే కర్మ అంటదు. ఇది శుద్ధ సత్వంలో వుండటం. ఇదిముదిరితే గాని నిర్గుణ తత్వంలోకి రాదు. అయినా ఆనందం అనుభవిస్తున్నానంటాడు. కాన ద్వంద్వం కదా. తాను వేరు ఆనందం వేరు రెండున్నాయి. నేనెప్పుడు ఆనందమే రూపంగా యున్నాను. ఇది ఏకత్వం. ఏమీ అనుకోకుండా శరీరం పని చేసినా ఏకత్వమే నీవనుకోగానే, సంకల్పించగానే మాయ ప్రవేశిస్తోంది. కానీ రెండవవాడు లేకుండా పనిచేయు రెండవ వాడుంటే మోక్షానికి తక్కువై పోతాను. ఇదివరకు తెలియక పుణ్యకార్యాలు చేశాము. వాటిని విరమించుకొని మనస్సులేని స్థితిలో వుండాలి. అట్టి స్థితినుంచి పోవాలి మనసుంటే పోతాననే భావన కూడా వుండరాదు. నిర్వికారంగా వున్న భావన రాగానే జీవత్వం కల్గుతున్నది. ఇప్పుడు అలవాటు ప్రకారం శరీరం నుండి ప్రాణాలు పోయే సమయంలో భావం వచ్చి కూర్చుంటే మళ్లీ జన్మే. కాన వెంటనే మనస్సును వదలాలి. మళ్లీ దానిని రానీయరాదు. మనస్సనే కల్తీ తీశేసేయాలి. మనస్సును లేకుండా చేసుకునే బాధ్యత నాకుంది. సమాధి ఆనందానికి యిప్పటి ఆనందానికి తేడా వుండటానికి శరీరస్ఫురణయే కారణం. శరీర స్ఫురణకూడా లేకుండా పోవాలి. జీవత్వానికి కారణం అహంకారమే. నిర్వికారంగా యున్న ఇతరుల విషయాలు తన కర్థమైన పద్ధతిలో చూస్తున్నాడు. అహంకారం

ఈ క్రింది విధంగా మనలో పని చేస్తున్నది. ఇతరుల విషయాలు అర్థమై వారు నన్నే అంటున్నారని మనస్సులో కలవర పడుతున్నాడు. (1) కలవర పడిన తర్వాత బైటికి పోయి ఎవరితోనైనా చెప్పాలని పిస్తుంది (2) ఉద్రేకాన్ని ఆపుకోక బైటపడి చెప్పేసిందా, (3) అల్లరి ఎంత వుటుకు వుంది అది అర్థమై చెబితే పరువు పోతుందని వూరుకుందా? అంటే బీజావస్థలో వుండి మొలకెత్తి వూరుకుందా? లేక మొక్కగా వుందా? లేక మానయి బలపడిందా? భావాన్ని తొక్కి పెట్టే పరిస్థితి ప్రమాదమైనది. అహంకారము ఇన్ని స్టేజీలుగా వుంది. ఇతరులకు తన సంగతి చెప్పే పరిస్థితి వచ్చిందంటే అహంకారం ఎన్ని స్టేజీలు దాటి ఈ పరిస్థితిలో వున్నది. నిర్ధారణ చేస్తే రెండవ వానిగా అవుతున్నానని నీకు తెలుసుగా నిర్ధారణ చేస్తూ జన్మకు రావడం నీకిష్టమా? కొంచెం సేపు నిర్వికారమా? మళ్లీ నామ, రూప, గుణ, క్రియలగా నిర్ధారణ చేయుటవూ? ఇది అంతా దొంగాట అని తెలుసుకొని నామ రూపాలెక్కడున్నాయని మనసులో తగాదా పెట్టుకుంటున్నాడు. నామ రూపాలుంటే నష్టమేమిటి అని నీవు అనవచ్చు. నామ రూపాలు నిద్రలోలేవు. సమాధిలో లేవు ఇప్పుడున్నాయని ఎందుకంటున్నావు? నీకు సిగ్గేయుటం లేదూ? నామ రూపాలు లేవని గురువు చెప్పారు. అందుకని నామ రూపాలు మనస్సుండ బట్టి వచ్చాయి. కాబట్టి మనస్సునే తీసేసేయాలి. మనసు అంత తొందరగా పోతుందా చీర వెలిస్తే ముద్రలు లీలగా ఎలా కనిపిస్తాయో అలా మనసుంది. ఆ ముద్రలను కూడ పూర్తిగా పోయే దాకా తుడిచి వేశాడు. ఇల్లును తుడిచి వేశాడు. పిల్లలు, భర్త, జగత్తంతా ఏమీ లేదని తుడిచేశాడు ఎట్లా అయిసును ఎండ వాతావరణంలోకి తీసుకొస్తే కరిగి పోతుందో అలా నామ రూపాలను మొత్తం జ్ఞానాగ్నిలో తుడిచేసా. ఇన్ని వుంచుకొని సమాధి ఆనందం రావాలంటే ఎలా వస్తుంది. ఎంత తీసేసి నా మనసు ఎప్పుడో ఒకసారి మళ్లీ వస్తోంది. కాబట్టి నేనే లేకుండా పోవాలి. అద్దంలో నిజపిచ్చుక అద్దం మీద పొడిస్తే అబద్ధమైన ప్రతిబింబ పిచ్చుక పొడుస్తున్నట్లు నిజ పిచ్చుకకు అర్థమౌతోంది. నేనే మనసుగా వున్నా నేనే పోతే సరిపోతుంది. ఏ వూహా లేక పోతే మోక్షమన్న మాట. అసలు నేననే వాడు వుంటేగా పోవటాన్కి. కాని మనసు చావాలని నిర్ధారణ చేయడమేమిటి. వూరుకుంటే ఎవరూ లేరు. వూరుకోక పోతే అందరూ వున్నారు. చూస్తూ వూరుకుంటా. వచ్చే దానిని రానియ్, పోయే దానిని పోనియ్

నేనది కానప్పుడు నాకేం? శరీరమున్నా సరే పోయినా సరే. సూర్యుడెలా వున్నాడు. ప్రపంచంలో ఏమి జరిగినా సూర్యునికి ఏమి నష్టం లేదు. సూర్యుడిలాగా నేనుంటాను. ఏ భావము లేకుండా వుండాలి. ఇది నేనే చేస్తున్నానని అనిపించితే నీవు అహం కారం చెందుతున్నట్లే. బుద్ధి నమ్మకంతోనే వున్నావు. అ దీపం దగ్గర పురుగులు ఆడి దాన్ని తగిలి ఆవేడికి అవి క్రింద పడిచచ్చి పోతున్నాయి. పురుగులు చావటానికి దీపం తప్పేముంది. దీపం వాటిని రమ్మందా? చావమందా? అలా పరమాత్మనిన్ను రప్పించాడా? అహంకారమమ కారాలు పెట్టుకోమన్నాడా? భ్రమ చెందమన్నాడా? జీవుడిగా వుండి శరీరమే నేనని అనుకోమన్నాడా? అజ్ఞానంతో చేసి ఇతరుల మీద పడి ఏడిస్తే ఎలాగా? నీకు సలహా యిచ్చేదెవరు? నిర్గుణతత్వం సలహా యివ్వదు. శరీరం సలహా పాటిస్తుందిగాని సలహా యివ్వదు. లేని బుద్ధి నీకు సలహా యిస్తోంది. నామ రూపాల ధ్యాస పరమాత్మ ధ్యాసగా మార్చుకోవాలి. నిజంగా నామ రూపాలు లేవు. నామ రూపాలుగా కనిపించటానిక్కి మనోభ్రాంతే కారణం. చేపను నీళ్లనుండి బయట పడేస్తే ఉండలేదు. స్పీడుగా నీళ్లవైపే పరుగెడుతుంది. అట్లా బ్రహ్మ పదార్థంలో నుండి విషయాలలోకి వచ్చామంటే మళ్లీ బ్రహ్మ పదార్థం వైపుకు పరుగెత్తటం లేదు. ఈ శరీరము ఈ జీవత్వము ఈ మాయ అవసరమా? అనవసరమా? ఇదంతా కలలోలేనిది. లేని దాని గురించి ఇది అవసరమా? అనవసరమా అనే చర్చ ఎందుకు వస్తుంది. నామ రూపాలున్నా బాధ కలుగ కూడదు. అనటానికి వచ్చిన వారు కూడ ఆగిపోతున్నారు. ఎవర్ని చూసి, అసలు వాళ్ణే చూసి ఆగిపోయారు. ఆ ్మకని పించనప్పుడు మిమ్మల్ని తిట్టాను ఎదురు గుండా నామ రూపాలకు అంతరంగా ఆత్మకనిపిస్తే మిమ్మల్ని నేనెలా తిడతాను? మీరు చేసిన పని నాకు నచ్చలేదు. మిమ్మల్ని అనాలనుకున్నా. బ్రహ్మ పదార్థం అనుభవంలోకి వచ్చింది. కనుక నేను ఎవర్నయితే అందామనుకున్నానో వారిలో బ్రహ్మ పదార్థం కనపడటం వల్ల గబుక్కున అందామనుకున్నది ఆగిపోయింది. బ్రహ్మ కనిపిస్తే ఎలా అనగలవు. తిడదామని అనుకున్నవారు బయటికి రాలేక పోతున్నారు. వాసనలు మనో బుద్ధి చిత్త అహంకారాల ద్వారా శరీరం మీదకు వెడుతున్నది. శరీమునుండి జగత్తులోకి వెడుతున్నది. జగత్తులో మంచి, చెడు నిర్ధారణ చేసుకొని లోపలకు వచ్చి కర్మ చేసి జన్మకు కారణం అవుతున్నది. ఇంద్రియాలు, కర్మ చేయమని మనో బుద్ధి చిత్త

అహంకారాలను తొందర చేస్తున్నాయి. బుద్ధికి జ్ఞానంచే బయటకి రావటానికి యిష్టం లేదు. ఇట్టి పరిస్థితి కొంత కాలముంటే, ఇంద్రియాలు అంతఃకరణ క్షీణిస్తాయి. బ్రహ్మ పదార్థంలోనే వుండటాన్కి యిష్ట పడతాయి. అప్పుడుయింద్రియాలు బ్రహ్మ కార్యమే చేయిస్తాయి. అప్పుడు పూర్ణానందంగానే మిగిలి పోతారు. ఆవరణ పోయింది. శరీరం నమ్మకం పోయింది. భ్రాంతి పోయింది. భావన లేదు. కర్మపోయింది. జగత్తు పోయింది. తాను తానయినాడు. భగవంతుడెక్కడున్నాడు? అన్ని సామానులలోను వాడే వున్నాడు. ఎత్తి పారేద్దామంటే దానిలో కూడ వాడే వున్నాడు. ఏమీ పారేయబుద్ధి అవుతుంది? ఇలాగే జరగాలని ఎవరైనా రూలు ఇచ్చారా? పైగా నిజంగా మెలుకువ వచ్చిందనుకోండి. ఏది ఎలా వున్నా మనకు బాధగా వుండదు ఎలాగున్నా ఫరవాలేదనుకుంటే బాధ లేదుగాని, ఇలాగే వుండాలను కొని అలా జరగకపోతే బాధ కదా. ఏదో రకంగా రాగ ద్వేషాలు కలుగుతున్నాయి. అందుచే కర్మ చెడిపోయి జన్మలు వస్తున్నాయి. దుఃఖం కలుగుతోంది. నిన్ను మాటలనేవారున్నారనుకో. వాళ్లు కర్మ సంపాదించుకొని జన్మఎత్తారనుకో. నీవు అనుకోకుండా వుండు. అంతా పరమాత్మే అనుకో. కోపమొస్తే చెంబు తప్పాల విసిరేస్తారు. అలాగే మనం శరీరాన్ని చూపెడుతున్నారా? గురువు మాట వినకుండా మనసు మాట వింటున్నాడు. పరమాత్మ శక్తి వాడుకొని మనసు శరీర భ్రాంతి కలిగిస్తున్నది. రాగద్వేషాలు పెంచుకొని అహం పెరుగుతున్నది. అసలు వచ్చిన వాడు లోపలున్నాడు. రాగద్వేషాలు కల్గించిన వాడు లోపలున్నాడు. ఏమన్నా అందామా అంటే వాడు కనిపించడు. శరీరంమీదే కనిపిస్తాడు. చూపులో, మాటలో, చేతలో కనిపిస్తాడు. ఆశ్రయించిన శరీరాన్ని కొడితే వాడి శరీరాన్ని చంపినా కోపమున్నా అసలు వాడు చావలా. అది ఇంకొక శరీరంలో ప్రవేశించి ఆ కోపాన్ని చూపెడతోంది. విచారణవల్ల బుద్ధిలో విశ్వాసాలు లేకుండా పోవాలి. జగత్తు కనిపిస్తున్నా జ్ఞానాగ్నిలో దగ్ధమవాలి. భౌతికంగా పోవటం కాదు. వున్నాయనే విశ్వాసం పోవాలి. ఇలా ఎప్పుడు బుద్ధిని, శుద్ధం చేసుకుంటూ భావాతీరంగా వుండాలి. కర్మ చేస్తున్న సమయంలోనే భావాతీతంగా వుండాలి. ఇదే సాధన. ఎవరైనా శబ్దంతో అన్నారనుకో లోపల కదిలితే అవునండి నాదే తప్పుయిపోయింది. అంటే ఒక మాటతో పోతుంది. ఆలోచించి చెప్పేది ఏమీ వుండకూడదు. ఒక వేళ కదిలిందే అనుకో ఆ కదలిన దాని పైకి

పొక్కనివ్వకుండా లోపల విచారించి మట్టుబెట్టి ఆ భావన ప్రకారం కర్మ చేయకుండా జాగర్త తీసుకుంటే మధురంగా ఉండటాన్కి వీలవుతుంది. బుద్ధికి మనం స్వాధీనమవకూడదు. బుద్ధిని మనం స్వాధీనం చేసుకోవాలి. ఎక్కువ మాట్లాడరాదు బయటి విషయాల గురించి ఆరాతీయరాదు. ఇతరులతో చుట్టాలతో ఏది అవసరమో అది మాత్రమే చేసి వాళ్లు చెప్పినవి బుద్ధిలో దిగ నీయరాదు. ప్రాపంచిక విషయాలయందు అనాసక్తిగా వుండాలి. అమ్మా ఇది మాయ అంటావు. నీ మొగం తగలెయ్యా నీ స్నేహము చేసి చెడి పోయాను. విచారణ చేయటానికి నీవెవరవు. అంతా ఆత్మగా వుంటే మధ్యలో మాయ ఎక్కడుంది. మాయను ఎవరు తెచ్చి పెట్టేరు. నువ్వే తెచ్చి పెట్టుకున్నావు. నీవే తీసేసెయ్యాలి. జ్ఞానమున్నప్పటికి దానిని వుపయోగించక పోవటం చేత మనభావాలు తగ్గటం లేదు. ఎంత బ్రహ్మగా వున్నా ఇతరులు చేసింది మీకు నచ్చక నన్ను బాధిస్తున్నారని అనుకో బుద్ధి అవుతోంది. కారణ మేమిటి అక్కడ బాధించే పదార్థమే లేదు. శరీరమే నేననుకుంటున్నావు కనుక ఇతరుల మాటలు క్రియలు నీకు నచ్చటం లేదు. నీవు వేరు, ఇతరులు వేరని నీవు శరీరాలను బట్టి విభజిస్తున్నావు. ఇదే జీవత్వం. ఆత్మ అందరిలో ఒకటిగానే వున్నది కదా! అఖండంగా వున్న దాన్ని నీవు వేరు చేయుటం చేత నీకు బాధ కలుగుతోంది. విచారణ చేసుకొని ఎప్పుడూ అఖండంగా వుండాలి. అఖండంగా వుండి భావాతీతంగా వుంటే ఎప్పుడూ ఆనందమే. అజ్ఞానిగా వున్నప్పుడు గమనించిన వాటిని ఆచరిస్తూ బుద్ధిలో కాన్ని నమ్మకాలుంచుకొంటున్నాడు. మంచిని, చెడ్డనీ, తనవని, పరాయివనీ విభజించుకొని బుద్ధి నమ్మకాన్ని బట్టి ఆచరిస్తున్నాడు. జ్ఞాని యెప్పుడూ ఆత్మ భావం పెట్టుకొని నిర్వికారంగా వుండి రెండవ దాన్ని నమ్మకుండా వున్నాడు. రెండవది వుంటే కల్గే నష్టం తెలుసుకున్నాడు. జన్మ వస్తుందని, నీవు పాడై పోతావని, నీవు మాట్లాడకుండా వుండాలి. మాట్లాడితే చెడిపోతావు. బయటకు వస్తే దెబ్బతింటావు అని గురువు చెప్పాడు. అయినప్పటికి అలవాటుగా నీవు ఆద మర్చి వుండగా నీ ఫ్రెండుగాడు (మనస్సు) ఇంద్రియాల రూపంలో నిన్ను బయటకు నెట్టేస్తున్నాడు. వాడి నమ్మకాన్నంతా నీ ద్వారా బయటకు పంపుతున్నాడు. ఈ శరీరాన్నే మనసు వాడుకుంటోంది. గురువు వాడుకొంటున్నాడు. ఈ శరీరం ఇప్పుడు గురువు స్వాధీనములో వుందా? మనసు

స్వాధీనంలో వుందా? అందుకని నీవు మాట్లాడకుండా వుంటేనే లోపలికి ఎవరు వచ్చేది తెలుస్తుంది. ఆ వచ్చిన వాళ్లను బయటకు వెళ్లకుండా చేస్తే అది ఎక్కడ నుంచి పుట్టిందో అక్కడే అంతమౌతుంది. మాట్లాడకుండా వుంటే మనస్సుకు పట్టులేకుండా పోతోంది. అందుచేత మనసు నిన్ను ఏమార్చి బయటవున్న నామ రూపాలతో నిన్ను భ్రమింప చేస్తున్నది. ఒరే నీవు నోరు మూసుకుంటే ఎట్లా? నీ మొహం నల్లగా పెట్టుకొని ముడుచుకున్నావేమిటి? నీవు మాట్లాడకుండా వుండడమేమిటి? ఎలాగో ఒక లాగ నిన్ను మైమరపించి ఏదో ఎర జూపించి నీ చేత మాట్లాడింప చేస్తుంది మనసు. మనసు దొంగాట ఆడుతున్నది. మనసు బయట వున్న వారి చేత నిన్ను ఏదో అనిపించి లోపలనుంచి ఒరే వారు నిన్నే అంటున్నారు. అని నిన్ను ప్రేరేపించి నీ చేత మాట్లాడింప చేస్తున్నది. అసలు నేనుకు ఇదంతా తెలిసినప్పటికి మనస్సును నిరోధించడానికి శక్తి చాలడం లేదు. నీవు శక్తిగలవాడివయినప్పటికి, విషయాలచేత మోహింప బడి బయటికి వెళ్లి మంచి చెడ్డనమ్మకాలు ఏర్పరచుకొని ఆ నమ్మకాలను వదలలేక పోతున్నావు. ఈ నమ్మకాలు లేక పోతే మన మెప్పుడు ఆనంద స్వరూపులమే. నమ్మకాలు లేక పోతే అరమరికలు లేకుండా చాలా ప్రశాంతంగా వుంటుంది. దాపరికం లేకుండా పోతుంది. దాపరికమే జన్మకు కారణం. ఇది ఫలానా జ్ఞానం, అజ్ఞానం ఇత్యాదివి గుర్తు పట్టాలంటే తను అనగా ఆత్మవుంటేగదా గుర్తు బడుతున్నాడు. జ్ఞానంగా ఈ శరీరాన్ని ఎప్పుడు సవరించుకుంటాడో అంటే జ్ఞానం బుద్ధిలో దృఢంగా వుంచుకోవాలి. విషయాలకు లొంగ కూడదు. మోక్షం బయటనుంచి సంపాదించవలసిన పని కాదు. ఇక్కడే వుంది. తను శుద్ధంగా ఏక భావన అయితే ఏ అడ్డూలేకయున్నది, వున్నట్లు ప్రకాశిస్తుంది. ఇప్పుడు దేనికి దానికి విడిగా విభాగించుకొని, ఇది దేహం, ఇది మనసు, ఇది బుద్ధి, ఇది సృష్టి ఒక దానికి ఇంకొక దానితో సంబంధం లేకుండా, ఎవరి కర్మ వారిది, ఎవరి గుణం వారిది. ఎవరి పద్ధతి వారిది అని విభాగించుకొని మోక్షం కావాలని దండాలు పెడుతున్నాం. రూపాయిలో కొంత భాగాన్ని పనికిరాని దాని క్రింద పెట్టేసి, ఒకటి కావాలంటే ఎలా అన్నీ కలిపితే కదా, ఏకమయ్యేది. ఇప్పుడు ఏం చెయ్యాలి. ఆత్మ అనే నేను అన్నిటిలో ఒకటిగా అఖండంగా వున్నాను. రెండవది లేనేలేదు. రెండవ వాడయి రెండవ వాడిగా చూడటమే అజ్ఞానం. కదలకుండా

ఒకటిగా వుంటే జ్ఞానం. కదిలితే రెండవ వాడయి మోహంలో అజ్ఞానం అవుతున్నది. మూడు గుణాలను చూస్తున్నవాడు సమాధిలో నున్నట్లు. మూడు గుణాలు నీకేవున్నాయని వాటితో మేకమయి వాటిని వాడుకున్నవాడు జీవత్వంలో వున్నట్లు. మనసు ఏం చెబుతుంది. బయట వున్న వాడు నీ విరోధి అని, ఒట్టిదే వాడే, మనస్సే విరోధి అని తెలుసుకొని దానితో కలవకుండా దాని దోషాలను తొలగించితే మనసు శుద్ధమయి ఆత్మలో లయమౌతుంది. పూర్తిగా నశిస్తుంది. అదే మోక్ష స్థితి. ఎంతమంది మాట్లాడినా గ్రహించకుండా తాను ధ్యాన నిమగ్నుడైతే శబ్దాన్ని లయం చేసుకోగలడు. అయిదు జ్ఞానేంద్రియాలు లయ మవుతాయి. జ్ఞానేంద్రియాల వశమయినా అంతరింద్రియాల నిగ్రహం కూడా కావాలి. జగత్తంతటిలో తనని; తనలో జగత్తును చూడకలిగితే మనస్తాపం పోతుంది. పరిపూర్ణానందం కలుగుతుంది. ఇది పరమాత్మకే చేస్తున్నాను అనుకుంటే ఇందులో ఆనందం కనబడుతుంది. ఏదో ఒక దాని మీద వైరాగ్యం కలిగితే అది పిచ్చి. మొత్తం ప్రపంచం మీద విరక్తి కలగాలి. మోక్షం కావాలంటే నిశ్శబ్దంలో పిలవాలి. పేరు పెట్టి పిలిస్తే రాడు. నిశ్శబ్దంగా వున్న వాణ్ణి పిలవాలి. ఈ సృష్టంతా పరమాత్మ స్వరూపమే. ఏ రూపములో కనబడుతున్నదో అది దాని రూపము కొంచెము కూడా రాదు. ఈ భావము కలవాడు శాంతంగా వుంటాడు. సంసారంలో వుంటూ పరతత్వ స్వర్మానుభావాన్ని పొందుతూ హృదయంలో పూర్ణ చంద్రునికి సమానమైన జ్ఞానముతో వుంటాడు. నేను పుట్టటమే తప్పు అని అనుకోకుండా ఇతర్లదే ఆ తప్పు అని అనుకొంటున్నాడు. మనసుగా వుండి ధర్మం, అధర్మం అని అనుకుంటే జీవుడవుతున్నాడు. బుద్ధిలో జ్ఞాన బలం ఎక్కువగా వుంటే శాశ్వతమైన బ్రహ్మను గుర్తు చేస్తూ వుంటుంది. మనసు బలం ఎక్కువగా వుంటే ఇంద్రియాలలోకి వచ్చి విషయాలలో చిక్కుకుని మంచి చెడు మొదలైన ద్వంద్వాకారంగా వుంటుంది. వస్తువులను వాడుకొని పనైన తరువాత వాటిని వాటి చోటులో మనం వుంచుకొన్నట్లు, మనసు, బుద్ధి, చిత్తం, అహం కారాలను, ఇంద్రియాలను అవసరం వచ్చినప్పుడు వాటి పనియైన తరువాత వాటి స్థానాలలో వాటిని వుంచాలి. నువ్వు మనసువైపు ఎందుకు మొగ్గుతున్నావు అని అడగాలి. నిద్ర పోతున్న సమయంలో ఏ బాధ లేక ఆత్మగా, హాయిగా వున్నట్లుగా మెలుకవ కాలంలో అంటే

జాగ్రదావస్థలో వుండక పోవటానికి కారణమేమిటో మనం గ్రహించి శరీరం పనిచేస్తున్నా మనసులో ఎట్టి వికారము లేకుండా కర్మేంద్రియాలు పని చేస్తుంటే జ్ఞానేంద్రియాల చేత నిర్ధారణ ఏ రకంగా జరుగుతోందో తెలుసుకొని అట్టి నిర్ధారణ జరగకుండా చేయవలసిన బాధ్యత మనయందు వున్నది. అట్లు చేయగా, చేయగా భావనాత్రయం లేకుండా పోతుంది. (సంశయ భావన, విపరీత భావన, అసంభావన) ఆవరణ విక్షేపాలు ఏమి చేయలేవు. ఒక చిల్లుకుండలో కార్తీక దీపం పెడితే ఆ దీపంలోంచి ఆ చిల్లుల ద్వారా లోపలున్న దీపకాంతి ప్రసరించినట్లుగా పరమాత్మ వెలుగు ఇంద్రియాలద్వారా బయటకు వస్తున్నది. దండలో పూలు వాడిపోతాయి గాని దారం ఎపుడూ వుంటుంది. అలా నామ రూపాలు గలవన్నీ పోయేవే కాని వాటి అన్నిటికి ఆధారంగా యున్న పరమాత్మ ఎప్పుడూ వుండేదే. నీవు పరమాత్మే, నేను పరమాత్మే నాకూ నీకు మధ్య వున్నది కూడా పరమాత్మే అని తెలుసుకోవాలి. సాధనా బలం చేత శరీర, ఇంద్రియ, అంతఃకరణలు జడాలుగా అవాలి. అవి పనిచేసే యోగ్యత వున్నప్పటికి అవి కదలని స్థితికి రావాలి. ప్రయత్నంలేకుండా సహజంగా, అప్రయత్నంగా అట్టి స్థితి కలగాలి. సమిష్టి ధ్యానం చేస్తే మనమనో వికారాలు ఎప్పటికప్పుడు మనకు తెలియబడతాయి. అందువల్ల విచారణ చేసి మనోవికారాలను అక్కడికక్కడే మట్టుబెట్టవచ్చు. వ్యవహారం వేరు, వేదాంతం వేరు అని అనుకోకూడదు. వ్యవహారమెంతో వేదాంతమంతే. ఉన్న పరమాత్మ వ్యవహారంగా వుంది. వ్యవహారంతో పరమాత్మ నమ్మకం లేకుండా మనుష్యులమీద, రాగా ద్వేషాలమీద, నమ్మకం కల్గుతుంది. అందుచేత పరమాత్మ కన్న అన్యంగా వ్యవహారం లేదని తెలుసుకొని వ్యవహారాన్ని పరమాత్మ కోసమే, మోక్షం కోసమే చేయాలి. మనసు బుద్ధి ఎటువైపు మొగ్గుతున్నాయో తెలుసుకొని ఎప్పుడూ పరమాత్మవైపే అదీ మొగ్గేటట్లుగా చూచుకోవాలి. పరమాత్మకన్నా ఇతరమైనవాటిని నమ్మకుండా ఎప్పుడూ పరమాత్మ స్థితిలో వుండటానికి ప్రయత్నించాలి. మీరు చేసేది మీరు బాగుందనే చేస్తున్నారు. కాని మీరు చేసేది నాకు నచ్చటం లేదు. నేను చేసేది మీకు నచ్చటం లేదు. అందరి ఆనవాయితీలు ఒక్కటే కాని మనం ఒప్పుకోము. అహంకారం ఒప్పుకోనివ్వదు. కారణం మాయ క్రియా శక్తిని జయించాల్సిన డ్యూటీ నీకుంది. క్రియ వుందని నీవు ఒప్పుకున్నప్పుడే

అది నిన్ను బంధిస్తుంది. జ్ఞాని దృష్టిలో క్రియలేదు. వాడికి చెప్పటాన్కి వుండి తీరవలసిందే అంటున్నాడు అజ్ఞాని. అక్కడ దాకా అజ్ఞాని వస్తే వాడూ కర్మలేదంటాడు. రాయికి చక్కలిగింత ఎలా లేదో జ్ఞానికి ఎట్టి పరిస్థితులలోను మనో వికారాలు కలుగవు. పరమాత్మ బుద్ధిలో ప్రతిబింబిస్తే శరీరానికి చలనశక్తి కలుగుతోంది. ఈ చలన శక్తికి బుద్ధి ప్రధానమైన లింగదేహం కారణం. శరీరానికి చావు పుట్టుకలుంటే అధ్యాస చేత ఎప్పుడూ వుండే తనకే చావు పుట్టుకలున్నాయని భ్రమ పడుతున్నాడు. మనసుకు శోకమోహాలుంటే అవి తనకే వున్నాయని పొరపాటు పడుతున్నాడు. బుద్ధికి చేయుటం, అనుభవించడం వుంటే నేనే చేస్తున్నాను. నేనే అనుభవిస్తున్నానని అనుకుంటున్నాడు. పిల్లలు ఆట వస్తువులతో కొంచెము సేపు ఆడుకొని తర్వాత వాటిని వదిలేసి పోతున్నారు. మనం ఆట వస్తువులయిన శరీర యింద్రియాలను వదలలేక పోతున్నాం. ఆట నిజమని భ్రమ పడుతున్నాం. తాను ప్రారబ్ధాన్ని చూచే వాడయినప్పటికి నేనే అనుభవిస్తున్నాననుకుంటున్నాడు. శరీరంతో సహా అంతా భగవంతుని సొత్తుగా వుంటే దానిని నాదనుకోవటం చేత అహం కల్గి, దుఃఖం కల్గుతున్నది. ఏది చూస్తున్నామో ఏది చెబుతున్నామో అదే చేయాలి. మనసులో చింతన, నోటి మాట, పనులు ఒకటిగా వుండాలి. త్రికరణాలు ఒకటిగా వుండాలి. అందరూ పరిపూర్ణ ఆత్మ స్వరూపులుగనే వున్నారు. గురువుకు శరీరంతో చెప్పటం అలవాటు. శిష్యుడు శరీరంతో వింటున్నాడు. ఇద్దరూ పొరపాటు చేస్తున్నారు. నేను జ్ఞానినంటూ మళ్లీ నా శరీరం, ఇంద్రియాలు, మనసు, బుద్ధి అంటాడు. అనుభవం చేస్తే మొత్తం పోవాలి కదా! గురుత్వం పోతుందేమోనని వివరించడు. శిష్యుడు తక్కువ వాడని అనుకోవటం గురువుకు పోకపోతే, శిష్యునికి ఎక్కువ, తక్కువయి పోయి సమభావం ఎలా కల్గుతుంది? ఇటువంటి గురువుల వల్ల ఏం ప్రయోజనం? శిష్యుడు ఎందువల్ల భ్రమలో పడ్డాడో ఆ భ్రమ ఎట్లా నివారణ అవుతుందో గురువు శిష్యునికి చెప్పాలి. అప్పుడు శిష్యుడు భ్రమ నివారణ చేసుకొని స్వస్వరూపంలోకి రాగల్గుతాడు.

సగుణమే నిర్గుణం. మనస్సుకు విషయమనే దయ్యం పట్టింది. విచారణతో దానిని బట్టబయలు చేస్తే అజ్ఞానం మన జోలికి రాదు. మనసును అదుపు చేయండి. అది ఏమి చెప్పుతుందో చూచి దానిని అమలులో పెట్టకండి. కోప్పడండి అప్పుడది

మీ దగ్గరకు రావటానికి భయ పడుతుంది. మీరు గట్టిగా చేయమన్నది చేస్తుంది. ఆత్మ ఆత్మగా వుండకుండా శరీరంతో కలిసి శరీరమే నేననే భ్రమతో చేస్తున్నాడు. శరీరంతో పనిచేసే కర్మని, ప్రారబ్ధమని, మంచి అని చెడు అని అనుకొంటున్నాడు. ఆత్మగా ఎరుకలో శరీరాన్ని పనిముట్టుగా పనిచేయిస్తే భావాతీత స్థితి స్వస్వరూప స్థితి కల్గుతుంది. పరమాత్మగా వుంటే చాలా తూచి తూచి మాట్లాడుతాడు. అవసరమైనదే ఎంత కావాలో అంత వరకే మాట్లాడతాడు. చేస్తాడు. ఏం చేసినా ఇతరులకు, బాధ కలగకుండా చేస్తాడు. మన వస్తువు మనం వాడుకుంటున్నప్పుడు మన ఇష్టం వచ్చినట్లు ఎట్లాపడితే అట్లా వాడుకొంటాం. అదే ఎవరి వస్తువైనా అరువు తెచ్చివాడుతున్నామనుకోండి, ఇది నాది కాదు అని మనకు అనుక్షణం గుర్తుండి దానిని చాలా జాగర్తగా వాడి తిరిగి ఎవరి వస్తువు వారికి భద్రంగా అప్పచెప్పుతాము. ఇదంతా పరమాత్మ సొత్తుగాన శరీరాన్ని ఇంద్రియాలను వస్తువులను మనం జాగర్తగా వాడి తిరిగి పరమాత్మకు భద్రంగా అప్పగించాలి. ఇంత పెద్ద శరీరానికి ఒక చిన్న ముల్లు గుచ్చుకుంటే దానిని తీసేదాకా మనకు నిద్ర పట్టదు. అలా నీవు పరమాత్మవు అయినప్పుడు రెండవ భావన ఎందుకు రానిస్తున్నావు. భావన రాగానే దాని ప్రకారము కర్మ చేస్తే ఇతరులకు బాధ కల్గుతుంది. మరి పరమాత్మగా వున్నప్పుడు ఇతరులకు బాధ కలిగే పనిచేయకూడదు లేదా నీలో భావన రాగానే ఇది మాయా కార్యమని తెలుసుకొని దానిని భావనను మట్టు బెట్టాలి. భావన ప్రకారము కర్మ చేయకూడదు. అన్నీ కనిపించినట్లు పరమాత్మ కనుపించడు. అంతా ఆయనగానే వున్నాడు. తెలుసుకోవాలి అనుకుంటున్నవాడే తెలియబడే వాడుగా యున్నాడు. కాన చూడటం కుదరదు. కన్ను తనను తాను ఎలా చూచుకోలేదో అట్లా పరమాత్మని పరమాత్మగా చూడటం అసంభవం. ఏ ప్రయత్నం లేకుండా, ఏ భావనా లేకుండా భావాతీతంగా వుండటమే స్వస్వరూప స్థితి. తాను తానుగా వుండే స్థితి. ఆత్మ స్థితి అఖండానంద స్థితి. ఆత్మగా వుండి మాట్లాడితే వాని మాటలు ఎవరిని నొప్పించకుండా ఆనందంగా వుంటాయి. జీవుడిగా వుండి మాట్లాడితే ఇతరులకు బాధ కలుగ చేస్తాయి. చూసేవాడు చేసే వాడితో కలవటం చేత అహంభావం కల్గుతుంది. మనసు ఇంద్రియాలు చెప్పేవి వినిపించుకోకుండా నిత్యం పరమాత్మ భావనలో వుండటానికి ప్రయత్నించాలి. బండతనంగా ఇదేమి లేదు. వీటివల్ల నాకు ప్రయోజనం లేదు.

శరీరం వున్నది కనుక దానితో పని చేయిస్తాను. లోపల ఊహ వుంచుకోను. పరమాత్మగానే వుండదల్చుకున్నాను. అవి అనుకోవటానికి ఒక పెత్తనం లేదుకదా. శరీరంతో పని ఆపకుండా మనసుతో పని ఆపటానికి అడ్డేముంది. పని చేస్తున్న సమయంలో మనసు ఎట్లా పని చేస్తున్నదో కనిపెట్టాలి. పని చేస్తున్నప్పుడే దొంగను పట్టుకోవడం కుదురుతుంది. ఎక్కడికో పోయి కర్మ విరమించుకొంటే దొంగ దొరకడు. దొంగ దొరికి దొరికినప్పుడే పట్టుకోవాలి. దొంగలు దొరికేటైమెప్పుడు మనుషులున్నప్పుడే పరమాత్మను నమ్ముతున్నావా బాంధావ్యాన్ని నమ్ముతున్నావా? నా శరీరం వుంటే వారి శరీరాలుంటాయి. నా శరీరం లేకపోతే వారి శరీరాలు వుండవు. నేను శరీరంగా లేక పోతే వారి శరీరాలను తీశేయబుద్ధి పుడుతుంది. మంచి మీదా నమ్మకం వుండరాదు. చెడు మీదా నమ్మకం వుండరాదు. రెండూ లేకుండా చేసుకొనాలి. మొత్తం ఖాళీ అవాలి. శరీరంలో ప్రాణముండగానే బుద్ధి నమ్మకాల్ని ఖాళీ చేయాలి. శరీరం ఎట్లా వుంటే నీకేమిటి. చచ్చిన తరువాత శరీరమేమైతే నీ కేమిటి. అది ముందే నిర్ణయించిన ప్రకారం జరుగుతుంది. ఆ ఆలోచననీకొద్దు. అలా శరీరం గురించి నిర్ధారణ చేసినప్పుడల్లా దాన్ని కోప్పడి బుద్ధిని బ్రహ్మాకార వృత్తిలో వుంచితే శరీరం అదే పోతుంది. ఎప్పుడైనా శరీరం నేనంటుందేమోనని ఎప్పుడూ ఆత్మ క్రింద వుండి శరీరాన్ని దూదేకినట్లు ఏకుతూ వుండాలి. దానిమీద అసహ్యం కలగాలి. ఎప్పుడూ శరీరం మీద నేరం మోపుతూ వుండాలి. ఇలా సాధన కాలంలో చేసి వైరాగ్యం పొందాలి. ఆత్మతో పరిచయమై జ్ఞానము కలిగిన తరువాత వేనిని ద్వేషించకుండ అసహ్యించుకోకుండా బుద్ధితో జ్ఞానం పండించుకొని అజ్ఞానాన్ని మనస్సులోకి ఇంద్రియాలలోకి దింపాలి. జ్ఞానమంటే వాసుదేవఃసర్వమితి. అంతా బ్రహ్మ, చీమనుంచి బ్రహ్మ వరకు అంతా పరమాత్మలో కరిగిపోవాలి. **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** ఆత్మ కన్నరెండవది ఇంద్రియ మనో బుద్ధులులోకి దూరకూడదు. ఇది కావాలని కాని అక్కర లేదని కాని, మంచని, చెడ్డని, ఇలా జరగాలని ఇలా జరగరాదని ఇలా ఏమి అనిపించరాదు. జ్ఞానేంద్రియాలకు, జిహ్వేంద్రియాలకు, గుహ్యేంద్రియాలకు సంబంధించిన ఎట్టిది కన్పించినా వినిపించినా, తోచినా వికారం కలగరాదు. ఏ కదలిక, ఏ భావన వుండకూడదు. ఇట్టి స్థితి **'ప్రజ్ఞానం బ్రహ్మ'** అనుభవానికి వచ్చిన స్థితి. వ్యష్టినుండి

సమిష్టికి రావాలి. అందరికి అన్ని జీవులకు హితం కలిగించేవి చేయాలి. ఏ పదార్థాన్ని తనకు అవసరం లేదు కదా. అవి పారేయరాదు. దానిని ఇతరులకు వుపయోగ పెట్టాలి. ఇంద్రియ మనోబుద్ధులలో జ్ఞానం పండిన తరువాత అన్ని ఇంద్రియాలద్వారా హాయిగా వుంటున్నాడు. బరువు బాధ్యతలు ఏమి లేవు, అన్ని ఇంద్రియాల పనులు జరిగి పోతున్నాయి. ఏవీ ఎదురు చెప్పే పరిస్థితి లేదు. అప్పుడు ఇంద్రియాలన్నీ నా మాట వింటున్నాయి అవి అహంకారం తలెత్తుతోంది. అహంకారమునగానే భ్రాంతిలో పడ్డాడు. అన్నీ పోయినా మళ్లీ భ్రమ వయసు చేత శరీర బాధలు కల్గితే ప్రారబ్ధం, కర్మ, అనుభవించాలని అన బుద్ధి వేస్తోంది. కాబట్టి జ్ఞానం ఎక్కడ? అమ్మ దుంపతెగ నేనేమిటి అనుభవించడమేమిటి? ఎంత మొండి జాతి అహంకారం ఎప్పుడు ఆదరిస్తుందోనని జాగర్తగా వుండి అది మొలకెత్తగానే విచారణ చేసుకొని జ్ఞానాగ్నిలో సర్వం బ్రహ్మ అనే ఎరుకలో అహంకారాన్ని మాడ్చి వేయాలి. లేచినది మొదలు నిద్ర పోయేవరకు శరీరం నుండి ప్రాణం పోయే వరకు ఇలాంటి సాధన చేయవలసిందే. ఎప్పుడూ ఏమరుపాటులో వుండరాదు. ఇక ఫర్వాలేదు. భ్రమ మరలరాదు. అని అనుకోరాదు. శరీరం రుగ్మతలకు లోనయి ఎన్ని బాధలకు గురి అయినా ఆత్మ స్థితిని కోల్పోరాదు. శరీర బాధలని చూచే వానిగా వుంటూ ఓర్పుగా వుండి ధైర్యముతో నేను రోగము లేని వాడిని శరీరమునకు సంబంధం లేకుండ వేరైన సత్, చిత్, ఆనంద ఆత్మస్వరూపుడనని ఆత్మాను సంధానము చేస్తూ మనస్సును ఏకాగ్రము చేస్తే శరీర బాధలు తేలికవుతాయి. ప్రాణం పోయే సమయం వచ్చినా చావు భయం లేకుండా ఆత్మాను సంధానం చేసి ప్రాణం పోయే సమయానికి ఆత్మగా వుంటే, ఏ భావనలేకుండా వుంటే మరల జన్మరాదు. ఎప్పుడూ నిర్భయంగా ఆత్మగా వుండాలి మనసులో భావన రానీయరాదు. మనసు ఏకాగ్రము చేస్తే బాధలు తెలియబడవు. మనసు ఏకాగ్రం అయినపుడు ప్రాణం పోతే తిరిగి జన్మరాదు. మనసు ఏమన్నా వినిపించుకోరాదు. బాధ కూడా దైవమని భావన చేసి బాధమీద మనసును ఏకాగ్రము చేయాలి.

ఓం మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే |
సర్వలోక శరణ్యాయ సాధు రూపాయ మంగళమ్ ||

ఓం మంగళం సద్గురు భ్యో ఉస్తు తద్గురోభో ఉస్తు మంగళం
అస్మత్పర్వ గురోభ్యో ఉస్తు నిత్య శ్రీశ్నిత్య మంగళం ॥

ఓం పూర్ణ మదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణముదచ్యతే
పూర్ణ స్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావ శిష్యతే ॥

ఓం సహనావవతు, సహనౌ భునక్తు సహ వీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మావిద్విషావహై ॥

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓం తత్ సత్

# నిర్వాణషట్కమ్

## (ఆత్మ షట్కమ్)



మనోబుద్ధ్యహఙ్కార చిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వానచ ఘ్రాణనేత్రమ్,
న చ వ్యోమ భూమి ర్న తేజో న వాయు
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

అహం ప్రాణసజ్ఞో న వై పఞ్చవాయు
ర్న వాసప్తధాతు ర్న వా పఞ్చకోశః,
న వాక్ పాణి పాదౌ న చోపస్థపాయూ
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః,
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

న మే ద్వేషరాగౌ న మే లోభమోహా
మదో నైవ మే నైవ మాత్సర్యభావః,
న ధర్మోనచార్థో న కామో న మోక్ష
శ్చిదానందరూపః శివోఽహం శివోఽహమ్.

న మృత్యు ర్న శఙ్కా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మా,
న బన్ధు ర్న మిత్రం గురు ర్నైవ శిష్య
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్,
న వా బన్ధనం నైవ ముక్తి ర్న బన్ధః
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.